# హరిలక్ష్మి

అనువాదం:

గద్దె లింగయ్య




ఆదర్శ గ్రంథమండలి

విజయవాడ-2.

# హరిలక్ష్మి

ఈ కథకు మూలవిషయం చిన్నదే. కాని ఆ అల్ప విషయమే కారణంగా హరిలక్ష్మి జీవితంలో జరిగినది మాత్రం స్వల్పమూ కాదు, తుచ్ఛమూ కాదు. ప్రపంచంలో అలా జరుతూనే వుంటుంది. ప్రశాంత నదీతీరాన ఒక పెద్ద ఓడప్రక్కనే చిన్న డింగీ కట్టివేయబడి నిరుపద్రవంగా వున్నదనుకోండి. ఆకస్మికంగా ప్రచండమైన తుపాను రేగి, ఓడకు కట్టబడిన త్రాడు తెగి, క్షణంలో ఆ చిన్న డింగీ పత్తా లేకుండా అదృశ్యమైనట్టే బేల్ పురం జమీకి భాగస్తులైన జమీందారు లిద్దరి జీవితమార్గాలు వేరైనాయి.

బేల్‌పురం తాలూకా పెద్దదేమీ కాదు. గుంజీలు తీయించీ, బండకొయ్యలు వేసీ రైతుల నెంత వేధించినా సాలుకు పన్నెండు వేలకు మించి వసూలయ్యేది కాదు. కాబట్టి జమీలో పది హేనుఅణాలన్నర వంతుకు హక్కుదారైన శివచరణ్ ముందు అర్థణా వాటాదారైన విపిన్‌బీహారీస్థితి ఓడ ప్రక్కనున్న డింగీలాంటిదే ననటం అతిశయోక్తి కాదు.

గారవు సంబంధమే అయినా యిద్దరూ ఏక వంశ. ఆ రేడుతరాలక్రితం యిద్దరి పూర్వులూ ఒక్క యున్నవారే. కాని యిప్పుడో! ఒకరి మూడంతస్థుల మానికి తలమానికంగా విరాజిల్లుతూంటే రెండో గోడల శిథిలగృహం రోజు రోజుకీ భూపతనమయ్యే ది.

అయినా విపిన్ జీవితంలో తతిమ్మాగోజులుకూడ సుఖ దుఃఖాలతో అలాగే గడచిపోయేవిగాని, అకస్మాత్తుగా తుపాను రేగి అంతా తలక్రిందులయింది.

పదిహేనుఅణాలన్నర భాగస్తుడు శివచరణుని భార్య మృత్యువువాతబడిన తర్వాతనే ఆయనమిత్రులు "నలభై-నలభై ఒకటికే ఏమంత వయసుమీరినట్టు? రెండోవివాహం చేసుకోండి" అని సలహాయిచ్చారు. "ఈయనకి ఇప్పు డొక్కడీ నలభయ్యో పడి! అది ఏనాడో వెళ్ళిపోయింది" అని అయిష్టులైనవారు నవ్వసాగారు. యదార్థానికి రెండూ నిజంకావు. పెద్దబాబుది కండపుష్టిగల దేహం. చక్కని ఎరుపురంగు. నిండైన మొహంలో రోమచిహ్నమే లేదు. యథాసమయంలో గడ్డం, మీసం రాకపోవడంవల్ల, కొన్ని వీళ్ళు, కొన్ని ఇబ్బందులు కూడ వుంటాయి. వయసు అంచనా వేయటంలో క్రిందికి పోగోరనివారు పై లెక్కలో ఏగడివద్ద ఆగుతారో ఆయనకే తెలియదు. సరే, ఏమైనప్పటికీ శ్రీమంతునివివాహం ఏదేశంలోనూ వయసే కారణంగా కాకపోదు; మరి బెంగాలులో ఎందుకవదు? నెలా పదిహేను రోజులవరకు శోక దుఃఖాలతోను "వద్దు" "కాదు" లతోను గడచిపోయింది. ఆ తర్వాత శివచరణ్ బాబు హరిలక్ష్మిని పెళ్ళాడి తీసుకొచ్చాడు. శత్రుపక్షంవాళ్ళు చెప్పుకున్నా "ప్రజాపతి" ఆయన యందు ప్రసన్నుడైనాడనే అనుకోవాలి. వరునిముందు వధువు వయసు అసంగతమని చెప్పుకోవటంతోనే వూరుకోలేదు. "ఈయనగారికి ఆ వచ్చే వధువు ఒక రిద్దరు బిడ్డలనుకూడా వెంటతీసుకొస్తే సరిపోతుం" దనేంత వరకూ ప్రచారంచేశారు అయిష్టులు. కాని తర్వాత అందరూ

ఆమె సౌందర్యవతి అని అంగీకరించారు. ఇంతకూ అసలు విషయ మేమిటంటే సాధారణంగా బాగా ఈడువచ్చిన తర్వాత పెళ్ళయే పిల్లలకంటే హారిలక్ష్మివయస్సు యింకా యెక్కువే. పందొమ్మిదేళ్ళు వుండొచ్చు. ఆమెతండ్రి అభ్యుదయ భావాలు గల సంస్కారవాది. ఆయన అతి ప్రయత్నంతో కుమార్తెను చదివించి మెట్రిక్ ప్యాసుచేయించాడు. ఆయన కోరిక మరొకటైనప్పటికీ, వ్యాపారంలో నష్టంవచ్చి, అకస్మాత్తుగా దారిద్ర్యం వచ్చిపడటంవల్ల ప్రియపుత్రిక నిట్టి సుయోగ్యుని కర్పించక తప్పకపోయెను.

లక్ష్మి పట్టణంలో పెరిగినపిల్ల. నాలుగైదురోజుల్లో ఆమె పతిని అర్థంచేసుకున్నది. ఆత్మీయులు, స్వజనంతోకూడిన అనేక పరిజనులతో నిండియున్న ఈ విశాలసౌధంలో ఎవరితోగాని మనస్ఫూర్తిగా కలిసిపోవడం ఆమెకు అసాధ్యమైంది. అటు శివచరణుని ప్రేమకుమాత్రం అంతులేదు. కేవలం వృద్ధునికి పడుచుపెళ్ళాంమీది ప్రేమేకాదు; అతనికి అకస్మాత్తుగా ఏదో అమూల్యనిధి లభించినట్లుంది. ఇంట్లోవారికి-నౌకర్లు, దాసీలకు ఆయన్నెలా అభినందించాలో తోచలేదు. కాని "ఇంక రెండో కోడలు మొహం నల్లబడింది. రూపంలో, గుణంలో, విద్యాబుద్ధుల్లో ఆమెగర్వం అణగిపోయిం" దన్నమాటలు తరచుగా లక్ష్మి వింటూండేది.

రెండోనెల తిరక్కముందే హారిలక్ష్మి జ్వరపడింది. ఆ జబ్బుస్థితిలోనే ఒకరోజున ఆమె తోటి కోడలును కలుసుకోవడం జరిగింది. రెండో కోడలంటే విపిన్ బాబు భార్య. పెద్దింటి కొత్తకోడలిజబ్బుసంగతి విని ఆమె చూడవచ్చింది. వయసులో

ఆమె రెండు మూడేళ్ళు పెద్దదై వుండవచ్చు. ఆమె అందమైన దేనని లక్ష్మికూడా మనసులో అనుకున్నది కాని ఈ వయసు లోనే ఆమె దేహంమీద తీవ్రదారిద్ర్యచిహ్నాలు స్పష్టంగా కనపడుతున్నై. వెంటనున్న ఆరేడేళ్ళ పిల్లవాడు బిక్క చిక్కి వున్నాడు. లక్ష్మి మర్యాదగా తనప్రక్కమీదే కూర్చో టానికి తాను ప్రక్కకుజరిగి, కాసేపు ఆమెవంక చూస్తూ వుండిపోయింది. చేతులను రెండుజతల బంగారుగాజులు తప్ప ఆమె వొంటిమీద మరోనగ యేదీలేదు. మాసిన మొరంచు పంచె - ఆమె భర్తదేమో - కట్టుకొనివుంది. ఆవూరు రివాజునుబట్టి కుర్రవాడు దిసమొలతో లేకుండా, రంగుగుడ్డొకటి చుట్టుకున్నాడు.

లక్ష్మి తోటికోడలి చెయ్యి మెల్లిగా తనవేపులాగుతూ అన్నది—“అదృష్టవశాత్తు నాకీ జ్వరం రాబట్టే మిమ్మల్ని చూడగలిగాను. వరుసకు నేను పెద్ద తోటికోడల్నే ననుకోండి. కాని మరదిగారు వారికంటె చాలా చిన్నవారని విన్నాను.”

చిన్న తోటికోడలు నవ్వుమొహంతో అన్నది—“వరుసకు చిన్నవారై తేమాత్రం నన్ను “మీా” రనవచ్చా?”

“సరే, మొదటిరోజున ఏదోఅన్నాను. ఇక నేను మాత్రం “మీా” రనను. మరి నువ్వుకూడ నన్ను “అక్కా” రనకూడదుసుమా. అలాఅంటే నేనూరుకోను. నాపేరు లక్ష్మి”

రెండోకోడలు “పేరు చెప్పడమెందుకు అక్కగారూ! మిమ్మల్ని చూస్తేనే తెలుస్తోంది. ఎవరో పరిహాసంగా కమల అని పేరుపెట్టారు నాకు...” అని కుతూహలంతో మందహాసం చేసింది.

హారిలక్ష్మికూడ "నీవంక చూస్తేనే నీపేరూ తెలిసిపోతోం" దని అనాలనుకొన్నది. కాని, అలా అనటం అనుకరించినట్లుంటుందని మానివేసింది. "మనయిద్దరి అర్థాలూ ఒక్కటే. కాని నేను నిన్ను నువ్వు అనగాలిగాను గాని నువ్వు నన్ను "ను" వ్వనటం జరుగలేదే?" అన్నది.

చిన్నకోడలు నవ్వుతూ జవాబిచ్చింది— "నోటినుండి చప్పున రావటంలేదు అక్కా! ఒక్క వయసు మినహాయిస్తే అన్నివిషయాల్లోను మీరు నాకంటె పెద్దలు. ఇంకా నాలుగు మూడు రోజులు పోనివ్వండి. అవసరమైతే మార్చుకోవటానికి ఎన్నాళ్ళు కావాలి?"

ఈమాటకు సమాధానం హారిలక్ష్మి నోటిపైకి రాలేదు గాని, తనలో అనుకున్నది—"ఈవిడ తొలినాడే పరిచయాన్ని దృఢతరం చేసుకోవాలనుకోవడం లేదే" అని పెదవి తెరవక ముందే చిన్నకోడలు లేచే సన్నాహంతో అన్నది—" ఇక వెళ్ళివస్తాను అక్కా! రేపు..."

హారిలక్ష్మి ఆశ్చర్యాన్వితయై "ఇప్పుడే వెళ్ళిపోవటమా! కాస్సేపు కూర్చో" అన్నది.

"మీరు కూర్చోమంటే కూర్చోకతప్పదు. కాని, ఇవాళ వెళ్ళనివ్వండి అక్కా! వారు వచ్చేవేళ అయింది." అని రెండో కోడలు లేచి నిలబడింది. పిల్లవాని చేయిపుచ్చుకొని వెళ్ళే ముందు నవ్వుతూ "వెడతాను అక్కా! రేపు కాస్త పెందలాడే వస్తానుగదా" అని నెమ్మదిగా వెళ్ళిపోయింది.

విపినుని భార్య వెడలిపోయిన తర్వాత హారిలక్ష్మి అట్టే వేసే చూస్తూ పడుకొన్నది. ఇప్పుడు జ్వరంలేదుగాని, అదో

రకమైన వ్యాకులంగావుంది. అయినా కాస్సేపు ఆమె అన్నీ మర చిపోయింది. ఇదివరకు ఎంతరెందరో ఆడపడుచులు, కోడళ్ళూ వచ్చారుగాని, ప్రక్కనున్న ఈ పేదయింటి కోడలికి సరిపోలరు. వారు తమంతటట తామే వచ్చారు; కూర్చున్నవారు లేవనే లేవరు. కూర్చోమంటేనా, ఇక చెప్పనేల! వారి వాచాలత్వము, వదరుబోతుతనము—వినోదం కల్గించడానికి వారుపడే ప్రయాస చూస్తే నవ్వొస్తుంది. మరి ఈమె వచ్చి తన పడకవద్ద కొద్దిక్షణాలుండి చేసిన పరిచయంతోనే ఏదో భారంతో అణగిపోతున్నట్టున్న హరిలక్ష్మి హృదయంలో విప్లవం రేగింది! ఆమె పుట్టింటి వివరాలు అడగడానికే అవకాశం లేకపోయింది. కాని అడక్కుండానే ఆమె తనవలె కలకత్తా పిల్ల కాదని గ్రహించింది హరిలక్ష్మి. పల్లెటూరిపిల్ల అయినా చదువుకున్నదని విపిన్ భార్య ప్రసిద్ధిచెందివుండటమే అందుకు కారణం కావచ్చు. మహాచదివితే స్వరయుక్తంగా రామాయణ-మహాభారతాలు చదువగలదేగాని, అంతకుమించి ఏమీ కాదని ఆమె తలచింది. విపినునివంటి దరిద్రునికి తన కుమార్తెనర్పించిన తండ్రి యింటివద్ద మాష్టరును పెట్టిగాని, స్కూలుకుపంపిగాని ఆమెను చదివించివుండడు. చామన చాయేగాని ఎరుపనడానికి వీల్లేదు. రూపం సంగతి వదిలేసినా విద్య, సంస్కారం మొదలైన ఏవిషయంలోనూ విపిన్ భార్య ఆమెకు సరిపోలదు. కాని లక్ష్మి ఒక విషయంలో ఆమెకంటె తానే తీసిపోతాననుకున్నది. అది ఆమె కంఠస్వరమే! ఆ స్వరం సంగీతమే! మాటలతీరులోకూడ తేనెవొలుకుతూంటుంది. ఏమాత్రం జడత్వంలేని సహజ సరళ వాక్సుధ ఆమెది. ప్రతి

మాటా యింటివద్ద కంఠస్థంచేసివచ్చినట్లుంది. కాని అన్నిటికంటె దూరంగావుండే ఆమె స్వభావం లక్ష్మిని మరీ కట్టివేసింది. ఆమె తాను పేదయింటి కోడలినని నోటితో చెప్పకపోయినా, తన కదే స్వాభావికమైనదనీ, మరొకటి తనపట్ల రాణించదనీ వెల్లడించినది! ఎంత చక్కగా! ఇంతవుమిసహో తన దారిద్ర్యాన్ని ప్రకటించాలన్న ఉద్దేశ్యం లేశమాత్రమైనా లేదు. ఒక ఉన్నత కుటుంబంలోని కోడలు మరో యింటి జబ్బుపడిన కోడలును చూడటానికి వచ్చింది, అంతే. సాయంత్రం చూచేందుకు భర్తవచ్చినప్పుడు హారిలక్ష్మి ఏమేమో మాట్లాడిన తర్వాత "యివాళ ఆ యింటి కోడలు వచ్చి వెళ్ళింది" అని చెప్పింది.

"ఎవరు? విపిన్ భార్యా?" అన్నాడు శివచరణ్.

"అవును ఇన్నాళ్ళకైనా నన్ను చూడటానికి రావటం నా అదృష్టమే! కాని అయిదారు నిముషాలకు మించి వుండలా. పనివున్నదని వెళ్ళిపోయింది" అన్నది లక్ష్మి.

"పనా? మరి వాళ్ళకు నౌకర్లా, దాసీలా? అంట్లు తోమటం లగాయతు పొయ్యిమీద కుండ మెక్కించటంవరకు సమస్తమైన పనులూ స్వయంగా చేసుకోవాల్సిందే. నీలాగా హాయిగా కాలుమీద కాలేసుకొని కూర్చోవటమే! నీవో గ్లాసుతో నీళ్ళు ముంచుకొని త్రాగాల్సిన అవసరమే లేదు"

తన్నుగూర్చిన యిలాంటిమాట లామెకు అసహ్యంగా తోచినై. కాని ఆ మాటలు తన్ను ప్రశంసించడానికేగాని, అవమానించడానికి అన్నవి కాదనుకొనుటవల్ల ఆమెకు కోపం

రాలేదు. "చిన్నకోడలికి మహాగర్వమని విన్నాను. ఆమె ఇల్లొదిలి ఎవరింటికీ వెళ్ళదటగా?" అన్నది

"ఎలా వెళ్తుంది? చేతులకు రెండేసి గాజులు తప్పితే యింకేమున్నై గడ్డలు! సిగ్గునల్ల ఎవరికీ మొహం చూపలేదు" అన్నాడు శివచరణ్.

హరిలక్ష్మి చిరునవ్వునవ్వి అన్నది—"సిగ్గెందుకు ? ఈ లోకులంతా ఆమె ఒంటిమీది నగలకోసమే ఏడుస్తున్నారా, అవి లేకపోతే ఆమెను చూచి ఛీ ఛీ అనటానికి ?"

"నగలా? నేను నీకిచ్చిన ఆభరణాలవంటివి ఏవెధవైనా కళ్ళతో చూచాడూ ? తన పెళ్ళానికి నేటివరకు రెండు గాజులు మినహా ఏమైనా ఇవ్వగలిగాడా వాడు? హుఁ హు! డబ్బు జోరే జోరు! చెప్పుతో కొడితే..."

హరిలక్ష్మి అత్యంత లజ్జితురాలై అన్నది—"ఛీ ఛీ ! ఎందుకండీ అలాంటి మాటలు !"

"లేదు లేదు; మనవద్ద చాటుమాట లేమీ లేవు. అనదలచుకున్నది స్పష్టంగానే అనేస్తాను" అన్నాడు శివచరణ్.

హరిలక్ష్మి కళ్ళు దించేసుకొని మెదలకుండా కూచున్నది. ఇంకేం చెప్పుతుంది ? వీరు బలహీనులనుగూర్చి చాలా అసభ్యంగా, కఠోరంగా కర్కశస్వరంతో అరవటమే స్పష్టవాదన అనుకుంటారు. శివచరణ్ శాంతించక యింకా అంటూనే వున్నాడు — "పెళ్లికి తీసుకున్నది ఇప్పుడు వడ్డీతో ఏడువందలయింది తెలుసా? పేదవాడా? ఐతే ఒకమూల పడివుండాలి. నేను తలచుకొంటే చెవులు మెలేసి బయటికి వెళ్ళగొట్టగలను.

హుం దాసీగా వుండటానికే తగదే, అది నా భార్యముందు అహం చూపుతుందా !"

హారిలక్ష్మి అటు తిరిగి పడుకున్నది. అసలే జ్వరపడి వుంది. పైగా విరక్తి, లజ్జలచే ఆమె ఒడలంతా లోపల్నుంచే వణకిపోతున్నట్టుంది.

మరునాడు మధ్యాహ్నం మృదు పదధ్వనివిని హారిలక్ష్మి కళ్ళు తెరచి చూచేటప్పటికి విపినుని భార్య మెల్లగా బయటికి వెళుతోంది. ఆమెనుపిల్చి "వెళ్లిపోతున్నావేఁ చిన్నకోడలా?" అన్నది.

చిన్నకోడలు సిగ్గుపడుతూ వెనుదిరిగివచ్చి "మీరు నిద్ర పోతున్నారనుకున్నాను. ఇవాళ ఒంట్లో ఎలావుంది అక్కా?" అన్నది.

"ఇవాళ చాలా బాగున్నది. ఏదీ నీముద్దుబిడ్డను తీసుకు రాలేదేఁ?" అన్నది హారిలక్ష్మి.

"అకస్మాత్తుగా నిద్రపోయాడు అక్కా !"

"అకస్మాత్తుగా నిద్రపోయాడా! అంటే?"

"దురలవాటని పగలు నిద్రపోనివ్వ నక్కా !"

—"ఎండలో అల్లరిచేస్తూ తిరగడూ?"

"తిరగకేఁ? అయినా మధ్యాహ్నం నిద్రపోవటంకంటె అదే మంచిది"

"నువ్వు నిద్రపోవన్నమాట?"

చిన్నకోడలు తలాడించుతూ నవ్వి అన్నది—"నిద్రపోను"

స్త్రీస్వభావానుసారంగా ఈసారి ఆమె తనకు పగలు పడుకోటానికి తీరిక వుండదని ఏమేమో ఏకరువుపెడుతుందని

హారిలక్ష్మి అనుకున్నది. కాని ఆమె అలా ఒక్క మాటా అన్లేదు. తర్వాత ఏవేవో మాట్లాడుకుంటున్నారు. మాటల సందర్భంలో హారిలక్ష్మి తనపుట్టిల్లు, సోదరీసోదరులు, స్కూలు మాష్టరుగారిని గురించేకాక తాను మెట్రిక్ ప్యాసైనవిషయం కూడా చెప్పివేసింది. చిన్నకోడలు శ్రోతగా ఎంత ఓర్పుగా విన్నా, వక్తమాత్రం కాదన్నసంగతి చాలాసేపటికిగాని హారిలక్ష్మికి స్పష్టంకాలేదు. ఆమె స్వవిషయమేమీ చెప్పనేలేదు. మొదట లక్ష్మికి సిగ్గువేసింది, కాని తర్వాత ఆలోచించగా అసలు పుక్కిటిపురాణం చెప్పడానికిమాత్రం ఆమెలో ఆ సరుకెక్కడిది? నిన్న లక్ష్మి కామెయందు చిన్నచూపు కలిగినట్టే ఇవాళ సంతృప్తిభావం ఏర్పడింది.

గోడను వ్రేలాడుతున్న విలువైన గడియారం శ్రావ్యమైన సంగీతం విన్పించి మూడు కొట్టింది. చిన్నకోడలు లేచినిలబడి వినయపూర్వకంగా "ఇక వెళతాను అక్కా !" అన్నది.

హారిలక్ష్మి కుతూహలంతో అడిగింది. "సోదరీ! మూడు గంటలవరకేనా నీకు తీరిక? మరదిగారు గడియారం చూచుకొని సరిగ్గా టైముకు యింటికి వస్తుంటారారాయేం ?"

"ఇవాళ ఆయన ఇంటిపట్టునే వున్నారు"

"అయితే తొందరేముంది ? మరి కాస్సేపు కూర్చోకూడదూ ?"

చిన్నకోడలు కూర్చోనూలేదు, వెళ్ళడానికి అడుగుతీసి ముందుకి వేయనూలేకపోయింది. మెల్లిగా అన్నది—"అక్కా! మీరు బాగా చదువుకున్నవారు. నేను వొట్టి పల్లెటూరి దాన్ని..."

"నీ పుట్టింటివారిది పల్లెటూరా?"

"అవునక్కా! శుద్ధ పల్లెటూరు. తెలిసీ తెలియక ఏమనబోయి ఏమన్నానో-అంతే కాని మిమ్మల్ని అగౌరవపరచ డానిక్కాదు; మీరు నన్ను ఒట్టేసుకొని చెప్పమన్నా చెపుతాను అక్కా!..."

హారిలక్ష్మి డంగైపోయింది. "అలా అంటావేమిటి చిన్నకోడలా. నిన్న నువ్వలాంటి మాటేమీ అనలేదే." అన్నది.

చిన్నకోడలు జవాబుగా ఏమీ అనలా. కాని, "వెడతాను"అని మళ్ళీ సెలవుతీసుకొనిమెల్లగా వెళ్ళిపోసాగింది. అప్పు డామెస్వరం అదోలావుంది. రాత్రి శివచరణ్ ఇంట్లోకి వచ్చేసరికి హారిలక్ష్మి పడుకొనివున్నది. అనుకున్న దానికంటె కులాసాగావుంది ఒంట్లో. మనసుకూడ ప్రశాంతంగా, సంతోషంగా వున్నది.

"ఎలావుంది పెద్దకోడలా?" అనడిగాడు శివచరణ్.

లక్ష్మి లేచి కూర్చుని "బాగానే వుంది" అన్నది.

"ప్రొద్దుటి సంగతి తెలిసిందా? కుంకని పిలిపించి అందరి యెదుటా ఝాడించేశాను—మళ్ళీ జన్మలో మర్చిపోకుండా. హుం, నాపేరు శివచరణ్ చౌధరి కాదూ మరి!"

హారిలక్ష్మి భయపడింది- "ఎవర్నండీ?" అనడిగింది.

"విపిన్‌ని పిలిపించి—నీ పెళ్ళాం మా ఆడవాళ్ళవద్ద కొచ్చి తన బడాయిచూపి, అవమానించటానికి ఎక్కణ్ణుంచి వచ్చింది దానికీ సాహసం? నీచురాలు, దుష్టురాలు! దాని

జుట్టు గొరిగించి గాడిదపై నెక్కించి వూళ్ళోనుంచి వెళ్ళగొట్టిస్తాను, తెలిసిందా?" అని చీవాట్లేశాను.

హరిలక్ష్మి ఒక్కసారిగా తెల్లబోయింది. "ఏమిటండీ మీారనేది?" అన్నది.

శివచరణ్ జొమ్ముచరచి అహంకారస్వరంతో అన్నాడు "ఈవూళ్లో జడ్జీ ఏమిటి, మెజిస్ట్రేటేమిటి, ఇన్స్పెక్టరేమిటి, పోలీసేమిటి—అన్నీ ఈ దాసుడే!! కొట్టేకట్లు, దహనంచేసేకట్టె అన్నీ నాచేతిలో వున్నై. నువ్వు ఒక్కమాట చెపితే రేపీపాటికి విపిన్ పెళ్ళాం వచ్చి నీ పాదాలు వొత్తకపోతే నేను లాటూ చౌధరికొడుకునే కాదు. నేను......"

ఈవిధంగా విపిన్ భార్యను అందరియెదుట అవమానించి నిందించడం వర్ణించుటలో, వ్యాఖ్యానించుటలో లాటూచౌధరి పుత్రుడు అనరాని కూతలు కూయటంలో ఏమాత్రం వెనుదీయలేదు. మరి అతనిముందు స్తబ్ధురాలై నిర్నిమేషదృష్టితో చూస్తూకూర్చున్న హరిలక్ష్మి "ఓభూదేవీ! బ్రద్దలైపోవమ్మా!" అనుకున్నది తనలో.

## 2

రెండోపెళ్లి పడుచుభార్య శరీరపోషణకు శివచరణ్ చౌధరి ఒక్క తనదేహం మినహా సర్వం అర్పించగలడు. హరిలక్ష్మి దేహారోగ్యం బేల్‌పురంలో కుదుటబడనేలేదు. గాలి, నీరు మార్చాలని డాక్టరు సలహాయిచ్చాడు. శివచరణుడు తన జమీాకి తగిన హోదాలో గాలిమార్పుకు ఎక్కడికైనా వెళ్ళడానికి సన్నాహాలు చేస్తున్నాడు. ప్రయాణంనాడు గ్రామవాసు

లంతా అక్కడే విరుచుకుపడ్డారు. కానిదల్లా విపినుడు, అతని భార్యమాత్రమే. బయట శివచరణుడు అనరానిమాటలంటు న్నాడు. లోపల పెద్దమేనత్త ఉగ్రరూపందాల్చింది. బయట బాబుగారి స్థాయిలో స్వరంకలిపేవారి కేమీ తక్కువలేదు. లోపల అత్తగారి చీత్కారాన్ని పెంపొందించే స్త్రీలూ కావలసినంతమంది వుండనేవున్నారు. ఏమీ అననిదల్లా హరిలక్ష్మి ఒక్కతే. చిన్నకోడలిపట్ల ఆమె కెవరికంటేనూ కోపం తక్కువలేదు. నా మూర్ఖపుభర్త ఎంత అన్యాయం చేసినా నానోటితో నేనేమీఅనలేదే?" అనుకున్నది. కానిఇవాళ ఇంట్లోవారు, బయటివాళ్ళు ఆడిపోస్తూంటే తా నేవిధంగానూ వారి స్వరంలో స్వరంకలపటం అసహ్యమనిపించింది ఆమెకు. ప్రయాణమై వెళ్ళేటప్పుడు మేనాతలుపుతీసి విపిన్ శిథిలగృహం వేపు తహతహతో చూచింది, కాని వారి ఛాయకూడా కానరాలేదు.

కాశీలో బస ఏర్పాటుచేయబడింది. అక్కడి స్వచ్ఛ వాతావరణంలో స్వాస్థ్యంచెడిన హరిలక్ష్మికి ఆరోగ్యం చేకూరుట కెన్నాళ్ళో పట్టలేదు. నాలుగునెలల తర్వాత ఆమె యింటికి తిరిగి వచ్చినప్పుడు ఆమె దేహకాంతినిగాంచి స్త్రీలే ఈర్ష్యచెందారు.

హేమంతఋతువు సమీపించుతోంది. మధ్యాహ్నం రెండోకోడలు దీర్ఘరోగపీడితుడైన తన పతికి ఉన్ని మప్లరు అల్లుతున్నది. దగ్గర్లోనే కూర్చుని కొడుకు ఆడుకుంటున్నాడు. వాడు చూచి "అమ్మా, పెద్దమ్మ!" అన్నాడు.

తల్లి చేతిలోపని ఎక్కడిదక్కడే వదిలేసి చప్పున లేచి నమస్కారం చేసింది. పీట వేసి కూర్చోమంది నవ్వు మొహంతో. "కులాసా చిక్కిండా అక్కా" అని కుశలప్రశ్న వేసింది.

"ఆఁ బాగానేవుంది. నయంకాకపోవడమూ కద్దుగా. అలాఅయితే తిరిగివచ్చేదాన్నే కాదు. వెళ్ళేప్పుడు నువ్వు వచ్చి చూచిపోనేలేదుగా. దారిపొడుగునా పల్లకీలోంచి మీ కిటికీవంకే చూస్తూ వెళ్ళాను. ఎక్కడా జాడేలేదు. జబ్బుపడి అక్క వెళుతోంది గదా అన్న మమతే లేకపోయిందిగా తోటి కోడలా! ఎంత కటికగుండె నీది!" అన్నది లక్ష్మి.

తోటికోడలికి కళ్లు అశ్రుపూరితాలైనాయి. నోట మాట రాలేదు.

లక్ష్మి మళ్ళీఅన్నది– "నాలో ఏదైనా దోషమే వుండు గాక. కాని నాది నీలాగా కఠినహృదయం కాదమ్మా! అలాంటి స్థితిలో చూడకుండా నే నుండలేను"

చిన్న కోడలు ఈ ఆరోపణకు కూడ ప్రత్యుత్తరమేమీ ఇవ్వలేదు. ఆమె మాట్లాడకుండా నిలబడివుంది.

లక్ష్మి ఇంతకుపూర్వమెన్నడూ యిక్కడికి రాలేదు. ఈ యింట్లో ఆమె అడుగుపెట్టడానికిదే మొదలు. అటూయిటూ తిరిగి గదులూ అవీ చూడసాగింది. నూరేండ్లనాటి పాడుపడిన గృహం మది. అందులో మూడుగదులు మాత్రమే వుండడానికి తగినట్టుగా వున్నాయి. దారిద్ర్యం తాండవిస్తోంది. సామాను లేనిదానితో సమానమే. గోడలసున్నం బెత్తికలుగా వూడిపోతోంది. మరమ్మతుచేయించగల తాహతులేదు. అయినా అనవసర గలీజు, చెత్త చూదామన్నా ఎక్కడా లేదు. పడకలు

చిన్నవేగాని, చాల శుభ్రంగావున్నై. రెండుమూడు దేవతల పటాలు, యింటావిడచేతి శిల్పకళాచిహ్నాలు కొన్ని గోడను వ్రేలాడుతున్నై. చాలవరకు కుట్లు కాగితంతో అల్లినవే. వాటిలో ఎర్రముక్కు చిలకగాని పంచరంగుల పిల్లిగాని లేవు. విలువైన ఫ్రేములలో వివిధరంగుల పూలతో అల్లిన "నమస్కారం" "స్వాగతం"లుగాని, లేక తప్పుడు ప్రచ్ఛాగణాలో సీతాళ్ళకము లుగాని లేవు లక్ష్మి ఆశ్చర్యంగా "ఇదెవరి పటమమ్మా, పరిచిత ముఖంలాగున్నదే" అనడిగింది.

చిన్నకోడలు సిగ్గుపడింది. నవ్వుతూ "తిలక్ మహారాజు పటంచూచి అల్లాను కాని బాగా కుదరలేదక్కా!" అని గోడను వ్రేలాడుతున్న తిలక్‌మహాశయుని పటం చూపింది.

లక్ష్మి చాలసేపు దానివంక చూచి మెల్లగా అన్నది—"గుర్తుపట్టలేకపోయాను. యిది నా పొరపాటే, సిగ్గుగాను. నాకు నేర్పుతావా చెల్లెలా? ఈ విద్య నేర్చుకోగల్గితే నిన్ను గురువుగా యెంచడానికేమీ సందేహంలేదమ్మా"

చిన్నకోడలు నవ్వసాగింది. రెండు మూడు గంటలుండి వెళ్ళేప్పుడు యిక నిత్యము శిల్పకళ నేర్చుకోటానికి వస్తానని చెప్పి వెళ్ళింది లక్ష్మి.

ప్రతిదినము వస్తూనేవుంది. కాని పది పదిహేను రోజుల్లోనే ఆ విద్య నేర్చుకోవటం కష్టతరమేగాక, చాలా వ్యవధి కావాలనికూడ తెలుసుకున్నది. ఒకరోజున "చెల్లెలా నువ్వు నాకు శ్రద్ధగా నేర్పటంలేదమ్మా!" అన్నది.

"చాలకాలం పడుతుందక్కా! మీరు ఇతర అల్లికపనులేవైనా నేర్చుకోవటం మంచిది"

లక్ష్మి లోలోపల కోపించుకున్నది. కాని బయటికి రానీకుండా అన్నది—"నువ్వెన్నాళ్లల్లో నేర్చుకున్నావమ్మా?"

"నా కెవరూ నేర్పలేదు అక్కా, నాకు నేనే శాస్త్ర శాస్త్ర అలవర్చుకున్నాను"

"అదీ! నువ్వుకూడా యితరులవద్ద నేర్చుకొనివుంటే కాలాన్ని గణించేదానివి."

నోటితో అన్నా అనకపోయినా తెలివితేటల్లోను, చురుకుతనంలోను తా నీ చిన్నకోడలికి సాటిరానని లక్ష్మి నిస్సందేహంగానే అనుకున్నది. ఇవాళ నేర్చుకోవటం సాగనే లేదు. మామూలు వేళకు ముందే సూది, దారం, నమూనాలు అవీ చుట్టచుట్టుకొని వెళ్ళిపోయింది. మరునాడు రాలేదు. తా నారంభించిన తర్వాత యిదే మొదటి నాగా.

మూడు నాలుగు రోజులైన తర్వాత హరిలక్ష్మి మళ్ళీ సూదీ దారం వగైరాలతో తోటికోడలి యింటికి వచ్చింది. చిన్నకోడలు అప్పుడు పిల్లవానికి రామాయణంలోని బొమ్మలు చూపి కథ చెబుతోంది. లక్ష్మిని చూడగానే లేచి పీటవేసింది. వ్యాకులస్వరంతో "మూడురోజులనుండి రాలేదు. ఆరోగ్యం బాగుండలేదా అక్కా?" అనడిగింది.

లక్ష్మి గంభీరంగా అన్నది—"లేదు. ఊరికేనే రాలేదు నాలుగైదు రోజుల్నుంచీను"

చిన్నకోడలు ఆశ్చర్యంతో - "నాలుగైదు రోజుల యిందా? అయితే ఇవాళ మరో రెండుగంటలు ఎక్కువసేపు కూర్చోబెట్టి నాగాలకు బదులు తీరుస్తానులే అన్నది"

"హుఁ; సోదరీ, నాకు జబ్బుచేసివుంటుందే అనుకో. మరి ఒక్కనాడైనా అడగనుకున్నావూ ?" అన్నది లక్ష్మి.

చిన్నకోడలు సిగ్గుపడుతూ అన్నది–"కనుక్కోవలసిందే కాని, యింటిపనుల్లో తీరికలేదు అక్కా! ఒంటరిదాన్నాయె. ఎవర్ని పంపను? అయినా నాది తప్పేనని ఒప్పుకుంటానక్కా!"

లక్ష్మి లోలోన సంతోషించింది. గత నాలు గైదు రోజుల్నుంచి అభిమానాతిరేకంచేతనే రాలే దామె. పైగా "వెళ్దాం" "వెళ్దాం" అనుకుంటూండగానే రోజులు గడిచి పోయాయి. ఇంట్లోనేకాదు, అసలీ ఊళ్లోనే ఈ తోటికోడలు తప్ప ఇంకెవరున్నా రామెకి మనసిచ్చి మాట్లాడేందుకు ?

పిల్లవాడు పటాలవంక చూస్తున్నాడు. హారిలక్ష్మి "నిఖిల్ ! నాదగ్గరికి రా బాబూ !" అని పిల్చింది.

వాడు దగ్గరికి రాగానే ఆమె తన సంచిలోంచి ఒక బంగారుగొలుసు తీసి వానిమెడలోవేసింది. "పోయి ఆడుకో" అన్నది.

తల్లి మొహంలో గాంభీర్యత వహించి "ఏ గొలుసు వాడి కెందుకిచ్చావు అక్కా?" అనడిగింది.

ప్రఫుల్లముఖియై "ఏం యిస్తే?" అన్నది లక్ష్మి.

"మీారు ఇస్తేమాత్రం వాడు తీసుకుంటాడా"!

లక్ష్మి సిగ్గుపడింది. "పెత్తల్లి ఒకగొలుసుకూడా ఇవ్వ లేదూ?" అంది.

"అదంతా నాకు తెలియదుగాని అక్కా! తల్లినై వుండి నేను వాడిని తీసుకోనివ్వకూడదు——నిఖిల్! దాన్ని తీసి పెద్దమ్మకి ఇచ్చెయ్యి——అక్కా ! మేము పేదవాళ్ళమే; గాని బిచ్చ

గాళ్ళంకాదు. విలువగల వస్తువైనా అస్వతంత్రంగా దొరికితే రెండు చేతులూ చాపుకొని పరిగెత్తే వాళ్ళంకాదు" అన్నది తోటికోడలు.

అత్యర్థ సఖురాలయింది. భూదేవి బ్రద్దలైతే బాగుండునను కున్నది ఇవాళికోడ.

వెళ్ళేప్పుడు లక్ష్మి యిలా అన్నది—"కాని ఈ సంగతి మీ బావగారి చెవినికూడా పడుతుందిలే చిన్నకోడలా!"

"వారు అనేమాటలు నా చెవిని చాలాపడుతున్నాయి. నేనన్న ఒక్క-మాట వారి చెవినిపడినంతమాత్రాన ఆ చెవులు అపవిత్రం కావు" అన్నది చిన్నకోడలు.

"సరేలే, గొప్పతనం చూస్తేనే తెలిసిపోతుంది" అని లక్ష్మి కొంచెమాగి "వారి అవమానించాల్సిన అవసరమే మున్నది చిన్నకోడలా? నాకూ ప్రతీకారం చెయ్యడం తెలుసు" అన్నది.

"ఇది మీరు కోపంతో అనేమాట. అంతేగాని, నేను మిమ్మల్నేమీ అవమానించలేదే. పైగా మీరు మీ భర్త నవమానించకుండా చేశానుకూడాను - ఈమాత్రం గ్రహించే పాటి మీరు చదువుకొనకపోలేదుగా" అన్నది చిన్నకోడలు.

"ఏంచదివినా నీలాంటి పల్లెటూరిదానితో పోట్లాడటం నేర్చుకోలేదులే" అని హరిలక్ష్మి కటువైన వాగ్బాణం విసరినా చిన్నకోడలు జవాబివ్వక మౌనంగానేవుంది.

లక్ష్మి వెళ్ళటానికి సంసిద్ధమవుతూ "ఈగొలుసు ఖరీదు ఎంతైనప్పటికీ నేను ప్రేమతోనే పిల్లవాడికిచ్చాను. అంతేగాని మీ ఆయన కష్టాలు తీరుద్దామని ఎంతమాత్రంకాదు. చిన్న

కోడలా! పెద్దవాళ్ళమాత్రమే పేదవాళ్ళని అవమానించడమే పనిగా తీసుకుంటారని మాత్రం నేర్చుకున్నావు. వారు ప్రేమించగలగనేది నువ్వు నేర్చుకోలేదు. అది నేర్చుకోవడం అవసరం. కాని తర్వాత కాళ్ళా వేళ్ళా పడవొద్దుసుమా?" అన్నది. చిన్నకోడలు దీనికేమీ జవాబివ్వక చిన్నవ్వు నవ్వి "ఆవిషయంలో మీరేమీ చింతించనక్కరలేదు అక్కా?" అన్నది.

# 3

వరద తీవ్రతతో మట్టి ఆనకట్ట కొట్టుకుపోవటం జరుగుతుంది. ప్రారంభంలో ఎక్కడో తెగిన నీటిప్రవాహం అనతికాలంలోనే ఎంత కోసివేస్తుందో, ఎట్టిభయంకర పరిణామహేతువో వూహించనలవికానిది. సరిగ్గా ఇదే జరిగింది హారిలక్ష్మి విషయంలో. ఆమె తనభర్తతో విపినునికి, అతనిభార్యకువిరుద్ధంగా ఆరోపణలు చెప్పటం ముగించిన తర్వాత తత్పరిణామాన్నూహించగానే ఆమెగుండె దడదడలాడింది. అబద్ధాలు కల్పించి చెప్పటం ఆమె స్వభావంకాదు; చెప్పాలనుకున్నా ఆమెవిద్యా, సంస్కారాలు ఆటంకపరుస్తాయి. కాని దుర్నివార జలవాహిని వలె, ఆ వుద్రేకంలో ఆమెనోటినుండి జారినవన్నీ యదార్థాలు కావు. అయినా అప్పుడా వాగురిని ఆపడం ఆమెశక్తికిమించిన పని. ఆమె తనభర్తస్వభావాన్ని పూర్తిగా ఎరుగదన్న విషయంమాత్రం నిజం. ఆమెభర్తస్వభావం ఎంత కర్కశమైనదో అంత ప్రతిహింసాపూరితము, మొరటుదీను. ఏ వ్యక్తినైనా కష్టపెట్టడంలో హద్దు అంటూలేదు అతనిదృష్టిలో.

ఇవాళ శివచరణుడు చిందులు త్రొక్కలేదు. అంతావిని "సరే, అయిదారు నెలలు జరిగినతర్వాత చూడు ! సంవత్సరం తిరుగు తుందనిమాత్రం అనుకోకు" అన్నాడు భార్యతో. అంతే.

హరిలక్ష్మి హృదయంలో అవమానాగ్ని భుగభుగ మంటోంది. ఆమె విపినుని భార్యకు బాగా బుద్ధిచెప్పాలను కున్నదీ నిజమే. కాని, శివచరణుడు బయటికి వెళ్ళిపోయిన తర్వాత ఆయన అన్న ఆ సామాన్య పదాలనే మళ్ళీ తనలో తాను పునరుచ్ఛరించుకోవటంతో హరిలక్ష్మిమనసుకు శాంతి లేకపోయింది. ఏదో మహా ఘోరం జరిగిపోయిందనిపించింది.

కొద్దిరోజులు గడచినతర్వాత హరిలక్ష్మి ఒకనాడు మాటలసందర్భంలో నవ్వుతూ భర్తను "ఏమండీ, వాళ్ళ విషయంలో ఏంచేశారేమిటి ?" అనడిగింది.

"ఎవరి విషయంలో?"

"విపిన్ బిహారిగారి విషయమేనండీ."

శివచరణుడు నిస్పృహ భావంతో అన్నాడు- "ఏంచేస్తాను, ఏమైనా చేయగలిగితేగా ! నా సామర్థ్యమెంత, నేనెంత?"

హరిలక్ష్మి ఉద్విగ్నహృదయంతో "అంటే?" అన్నది.

"నీతోటికోడలు "గవర్నమెంటు బావగారిదేమీకాదు, ఇంగ్లీషు సర్కారువారి"దవి అంటోందిగా!"

"అలా అన్నదా ? సరేకాని. మరి......"

"సరేకాని ఏమిటి?"

భార్య సందేహించుతూ అన్నది —" కాని రెండో కోడలు అలా మాట్లాడేమనిషి కాదే. చాలా చతురమతాయే! చాలమంది కల్పించి చాడీలుకూడ చెపుతారులెండి"

"ఇందులో ఆశ్చర్యపడవలసిన దేమీలేదు. ఈమా
నాచెవుల్తోనే విన్నాను" అన్నాడు భర్త.

హారిలక్ష్మి ఈమాట నమ్మలేకపోయింది. కాని ప
సంతోషపెట్టే తలంపుతో కోపంనటించి "ఇంత గర్వమ
నన్నంటే అన్నది, బావగారిని—మిమ్మల్నైనా శాస్త్రగౌరవి
కూడదూ ?"

"హిందూకుటుంబాలలో అలాగే అనుకుంటారు. క
ఈబిడ చదివిమిడికిన ఆడదిగదూ మరి ! హుం, నన్నవమాని
మనగలిగే దెవరు ? సరే వేరేపనివుంది. బయటికి వెళ్తున్నా
అని చెప్పి శివచరణుడు వెళ్ళిపోయాడు. హారిలక్ష్మి విషయా
తానుచెప్పాలనుకొన్నవిధంగా చెప్పలేకపోయింది. పైగా
వ్యతిరేకమయిందేమో అనేదే భర్తవెళ్లిపోయిన తరా
ఆమె మనసులో వుండుండి కలకవేయసాగింది.

బయటి కచేరిగదిలోకి వెళ్ళగానే శివచరణుడు విపిను
కబురంపి పిలిపించాడు. "విపిన్ ! నీగొడ్లను యిక్కణ్ను
తొలగించుమని అయిదారేళ్ళనుంచీ చెపుతున్నాను. రాత్రి
నిద్రపోవటానికి వీల్లేకుండావుందని చెప్పినా, నువ్వునామాట
నిర్లక్ష్యం చేయటానికే నిశ్చయించుకున్నావా ?" అనడిగ
శివచరణ్.

"అదేమిటి అన్నయ్యా ! నేను ఒక్కసారికూడా
లేదే?" అన్నాడు విపినుడు ఆశ్చర్యంగా.

శివచరణుడు అతి సామాన్యంగా అన్నాడు — "
నోటితో నేనే పదిసార్లు చెప్పాను నీకు. జ్ఞాపకంలేకపోతే న
నష్టమేమీలేదు, కాని యింత పెద్ద జమీని యేలుతున్న

మాటే మర్చిపోవటం న్యాయంకాదు. సరే, ఏమైనప్పటికీ ఇతరుల స్థలంలో ఎన్నాళ్ళీవిధంగా పశువులను కట్టివేసుకోవడమూ అని నీకు బుద్ధివుండాలి. నాకు తీరికవుండదు మళ్ళీ మళ్ళీ చెప్పటానికి, ఇదే ఆఖరుసారి హెచ్చరిస్తున్నాను."

విపిన్ నోటినుండి అసలొక్కమాట రానేరాదు. పైగా అతన్ని ఆశ్చర్యపరిచే ఈ క్రొత్తసంగతి ప్రస్తావించబడటంతో అతనికేమీ తోచకపోయింది. తన తండ్రికాలంనాటినుంచీ ఆ స్థలం తనదేననుకుంటున్నాడు. అది ఇతరులదన్న పచ్చిఅబద్ధాన్ని కూడ కాదని యెదిరించక, మెదలకుండా యింటికి వెళ్ళి పోయాడు.

అంతావిని అతనిభార్య అన్నది – "ప్రభుత్వంవారికోర్టు వుందిగా" అని

విపినుడు మౌనందాల్చాడు. అతడెంత పెద్దమనిషి అయినా, ఇంగ్లీషుప్రభుత్వన్యాయస్థానంలో పేదవాళ్ళు దూరేందుకైనా సందులేదని అతనికి తెలుసు. తుదకు జరగవలసినదే జరిగింది. మరునాడు పెదబాబుగారి మనుష్యులువచ్చి ఆకారానికి నిలబడివున్న గొడ్లపాకను పీకిపారేసి ఆస్థలంచుట్టూ గోడ నిలబెడుతున్నారు. విపినుడు స్టేషనుకువెళ్ళి రిపోర్టుచేసివచ్చాడు. కాని తమాషా ఏమిటంటే ఆ స్థలంచుట్టూ శివచరణుని పాత రాతి కొత్తగోడ తయారయ్యేవరకూ ఒక్క ఎర్రటోపీ అయినా ఆ చాయలకే అడుగుపెట్టలేదు. విపిన్‌భార్య చేతిగాజులనమ్మి, ఫిర్యాదుచేసింది. కేసుతోపాటు చేతిగాజులుకూడా పోయాయి.

వరుసను విపినుడికి మేనత్త అయిన ఒక ముసలావిడ అతని భార్యను హరిలక్ష్మి నాశ్రయించమని సలహాయిచ్చింది.

అందుకు "సింహంముందు చేతులుకట్టుకొని నిలబడితే యేం లాభం ? పోయేప్రాణాలు యెలాగూపోతాయి. పైగా అదో అవమాన మెందుకు?" అని విపినునిభార్య జవాబు చెప్పింది.

ఈ మాట హరిలక్ష్మి చెవిని పడిందికూడాను. అయినా ఆమె ఏమనటానికీ ప్రయత్నించకుండా వూరుకొన్నది.

గాలిమార్పుకోసం వెళ్ళి కాశీనుంచి వచ్చిన తర్వాత అయినా లక్ష్మి ఆరోగ్యం బాగుండడంలేదు. పై సంఘటన జరిగిన నెల్లాళ్ళకు లక్ష్మికి మళ్ళీ జ్వరం రాసాగినది. కొన్నాళ్లు వూళ్ళోనే వైద్యం చేయించారు. కాని, ఫలితమేమీ కన్పించలేదు. డాక్టరు సలహాతో మళ్ళీ మరోచోటుకు వెళ్ళడానికి సన్నాహం చేయవలసివచ్చింది.

అనేక పనులున్నకారణంగా ఈ పర్యాయం శివచరణుడు వెళ్ళక వూళ్ళోనేవుండిపోయాడు. వెళ్లేప్పుడు హరిలక్ష్మి తనభర్తతో ఒకమాట చెప్పిపోవాలని మహా ఆరాటపడిందిగాని నోరుతెరచి ఏవిధంగానూ ఆ మనిషియెదుట ఆ మాట చెప్పలేకపోయింది. చెప్పినా ప్రయోజనంలేదనీ, ఆయన తాను చెప్పేది గ్రహించలేడనీ, అనిపించిందామెకు.

## 4

ఈ పర్యాయం హరిలక్ష్మికి సంపూర్ణారోగ్యం చేకూరటానికి చాలాకాలం పట్టింది. సుమారొక సంవత్సరానికిగాని ఆమె బేల్‌పురానికి తిరిగిరాలేదు. ఆమె కేవలం పెద్ద 'జమీందారు భార్యేకాక, గొప్ప యజమానురాలుకూడాను. ఇందువల్ల గ్రామంలోని స్త్రీలు జట్లు జట్లుగా చూడవచ్చారు;

బంధువులైనవారిలో పెద్దవాళ్ళు ఆశీర్వదించారు. చిన్నవాళ్ళు పాదాలు కళ్ళకద్దుకున్నారు. ఒక్క విపినుని భార్యమాత్రం రాలేదు. ఆమె రాదని హరిలక్ష్మికి తెలుసు. ఈ ఏడాదిలోనూ విపిన్ గృహపరిస్థితి యెలావున్నదనిగాని అతనిపై జరుగుతున్న కేసులు, దావాలు ఏమైనాయున్న వివరాలుగాని తెలుసుకునేందుకు లక్ష్మి ప్రయత్నించలేదు! శివచరణుడు వూళ్లోనే వుంటున్నా అప్పుడప్పుడు భార్యవద్దకువెళ్ళి వుండి వస్తూండేవాడు. లక్ష్మి భర్తవచ్చినప్పుడల్లా వారివిషయాలు తెలుసుకోవాలనుకునేది. కాని ఒక్కనాడైనా ఆమె భర్త నొక్కమాటకూడ అడుగలేదు. అడగటానికి ఆమె భయపడింది. ఈపరికి ఏదో విధంగా వ్యవహారాలు తేలిపోయివుంటాయని అనుకొనేది. యిప్పుడు తాను వారివిషయం రేపితే, మళ్ళీ ఆయన క్రోధం ప్రజ్వలించుతుందేమోనని మిన్నకుండేది. ఆ తుచ్ఛవిషయాలు మరచిపోవాలనుకునేది. శివచరణుడైనా తానుగా వారి విషయం యెత్తనేలేదు. అతడు తనభార్యకు జరిగిన అవమానాన్ని విస్మరించలేదు. ప్రతీకారానికి తగిన ఏర్పాట్లన్నీ చేశాడు. ఈ సంగతి లక్ష్మిముందు దాచేవాడుకాదు గాని, యింటికి వచ్చాక వారికి తాను పట్టించినగతిని ఒక్కసారిగా ఆమె తన కళ్ళతో చూచి సంతోషంతో వుబ్బిపోవాలని అతని కోరిక.

బాగా ప్రొద్దెక్కకముందే మేనత్త అనబడే ముసలామె మాటిమాటికి వత్తిడి చేయుటచే హరిలక్ష్మి స్నానాదులు ముగించుకొని కూర్చునివుండగా ముసలమ్మ "అమ్మా నీ కింకా ఒంట్లో బాగా సరిగాలేదు. క్రిందికి వెళ్లొద్దమ్మా! అన్నం, ఫలహారం ఇక్కడికే తెప్పిస్తాను" అన్నది వాత్సల్యం వుట్టిపడేట్టు.

లక్ష్మి అభ్యంతరం చెప్తూ అన్నది—"నాకు వెనుకటిలాగే ఆరోగ్యం బాగానేఉంది అత్తయ్యగారూ! వంటింట్లోకివచ్చి భోంచేస్తాను. అన్నీ ఇక్కడికి మోసుకురావటం యెందుకు? పదండి, అక్కడికే వస్తాను"

ముసలావిడ "మాశివునిమీద ఒట్టమ్మాయ్!" అంటూ కదలనీకుండా ఆపింది. ఆమెచెప్పగానే ఒకదాసీ స్థలం శుభ్ర పర్చి పీటవేసింది. మరుక్షణంలో వంటావిడ భోజనం తెచ్చి వడ్డించింది. వంటమనిషి వెళ్ళిన తర్వాత లక్ష్మి పీటమీద కూర్చుంటూ "ఈ వంటావిడ ఎవరండీ? నే నిదివర కెప్పుడూ చూడలేదే!" అన్నది.

ముసలమ్మ నవ్వి "ఆనవాలు పట్టలేదాఅమ్మా! విపినుడి పెళ్లామే" అన్నది.

లక్ష్మి స్థబ్ధురాలైంది. తన్నొక్కసారిగా ఆశ్చర్యాన్వి తను గావించుటకే ఇంతకుట్రపన్ని దాచివుంచారని తనలో తాననుకొన్నది. కాస్సేపటికి తేరుకొని ముసలావిడవంక ప్రశ్నార్థకంగా చూచింది.

"విపినుడు చనిపోయాడు, విన్నావుగదూ?" అంది ముసలమ్మ.

లక్ష్మి ఇదివరకు వినియుండలేదు కాని ఇప్పుడే భోజనం వడ్డించి వెళ్ళిన ఆవిడవంకచూడగానే తెలిసింది—ఆమె విధవ అని. "అవును" అని తలూపింది.

ముసలమ్మ జరిగినదంతా వర్ణిస్తూ యిలా చెప్పింది— "ఏదో మిగిలిన మట్టీ—మశానం డావాల్లో తగలేసి విపిన్ చచ్చిపోయాడు. వున్నబాకీకి ఆ కాస్తకొంపకూడా చెయిజారి

పోతూంటే "పోనీ రెండేళ్ళు శరీరకష్టంచేసి ఆ ఇల్లయినా మిగుల్చుకో, నీకొడుకు తలదాచుకోటానికి" అని మేమంతా చిన్నకోడలికి సలహా చెప్పాము."

లక్ష్మి తెల్లపోయి మౌనంగా రెప్పలు వాల్చకుండా చూస్తూవుండిపోయింది. "నేనొకనాడు చిన్నకోడలిని ఒంటరిగా తీసుకెళ్ళి "అమ్మాయ్, అయిందేమో అయిపోయింది. ఎలాగో బాకీతీర్మానంచేసి ఒకసారి కాశీవెళ్ళి పెద్దకోడలుకాళ్ళమీద పడు. పిల్లాణ్ణి ఆమెపాదాలమీద పడేసి,అక్కా,వీడిదేమీ తప్పు లేదు, కాపాడమని ప్రాధేయపడు"మనికూడ చెప్పాను-"

చెపుతూ చెపుతూ ముసలమ్మ కన్నీళ్లు తుడుచుకుంటూ చెప్పసాగింది- "కాని ఆబిడ తలొంచుకొని అలాగే కూర్చున్నది. అవుననిగాని కాదనిగాని జవాబే యివ్వలేదు."

దీనికంతకూ పాపం తన నెత్తినే పడిందని హరిలక్ష్మి తెలుసుకున్నది. ఆమెకు నోట్లోముద్ద కటిక విషంలాగుంది. ఇంక ఒక్క ముద్దైనా మ్రింగలేకపోయింది. ఏదో పనిమీద అవతలికి పోయివచ్చిన ముసలమ్మ లక్ష్మిపళ్లెంలో ఎలావున్న అన్నం అలాగే వుండటంచూచి కలవరపడింది. "చిన్నకోడలా చిన్నకోడలా" అని బిగ్గరగా పిల్చింది. విపినునిభార్య తలుపు వెనక్కివచ్చి నిలబడగానే ఆమె బిగ్గరగా కోప్పడింది. అంతకు ముందే జాలితో కారిన కన్నీరేమయిందో పత్తాలేదు. తీక్ష్ణస్వరంతో "ఇలానిర్లక్ష్యంగా పనిచేస్తే లాభంలేదు. వంట ఇలా తగలేశావే? పెద్దకోడలు ఒక్కముద్దయినా నోట్లోపెట్టుకోలేకపోయింది!" అన్నది.

దీనికి తలుపువెనుకనుంచి సమాధానమేమీ రాలేదు. కాని ఇతరు లన్యాయంగా అవమానింపబడటానికి కారణభూతు రాలనయ్యానే అని గదిలో హారిలక్ష్మితల వాలిపోయింది.

ముసలమ్మ ఇంకా చీవాట్లు పెడుతూనేవుంది—"ఒకరివద్ద పనిచేయటానికి కుదిరినప్పుడు, సామగ్రి పాడుచేస్తే పనిజరగదు అమ్మాయ్ ! తోటికలుగుతూ చేసినట్టే నువ్వూ పనిచెయ్యాలని చెపుతున్నాను. తెలిసిందా?"

విపినుని భార్య ఈసారి మెల్లగా జవాబిచ్చింది – "మనస్ఫూర్తిగానే ప్రయత్నించుతున్నాను అవ్వగారూ ! ఇవాళ ఏంజరిగిందోమరి!" అని క్రిందికి వెళ్ళింది. లక్ష్మి లేచి నిలబడగానే ముసలమ్మ "అయ్యో! అయ్యో!" అని నోలకొత్తింది.

"ఎందుకమ్మా అలా విచారపడతావు? నాకు వొంట్లో బాగుండక తిన్లేదు. అంతేగాని చిన్నకోడలు చేసినవంటలో లోపమేమీలేదమ్మా" అన్నది హారిలక్ష్మి మృదువుగా.

మొహమూ చేతులూ కడుక్కొని హారిలక్ష్మి తన గదిలోకి వెళ్ళిందేగాని, ఆమెకు ఊపిరాడనట్టుంది. అన్ని విధాలా అవమానం సహించుతూకూడ విపినునిభార్య యీ యింట్లో నౌకరీచేయటం సంభవమే. కాని ఇంత ఘోరం చూచికూడ తా నీ యింట్లో యజమానినిగా యెలా చలా యించగలదు? నిరపరాధినియన్న సానుభూతి చిన్నకోడలిపక్షాన వుండవచ్చునేమోగాని లక్ష్మికేమున్నది !

రాత్రి లక్ష్మి భర్తతో ఇంకేంమాట్లాడుతుంది ! సరిగ్గా మొహమెత్తి చూడలేకపోయింది. ఇవాళ ఆమె నోటిమాట ఒక్కటే చిన్నకోడలి దుఃఖంయావత్తూ నిర్మూలించగలదు.

కాని దిక్కూ-మొక్కూ-లేని ఒక అనాథస్త్రీని యింతక్రూరంగా సాధించుతూన్న మనిషిని – అది ఘోరమూ, అన్యాయమనే ఏకోశానా యెంచని వ్యక్తిని ప్రాధేయపడి బిచ్చమడగటం లక్ష్మి కేమాత్రం మనస్కరించలేదు.

శివచరణుడే నవ్వుతూ "చిన్న కోడలినికలుసుకున్నావా? వంట ఎలాచేస్తోంది?" అని అడిగాడు.

హరిలక్ష్మి జవాబివ్వలేకపోయింది. ఈ కఠినాత్ముడే తన భర్త. తనజీవితమంతా యీయనతోనేవుండి సంసారం సాగించాలే అని వ్యథచెంది, భూదేవిబ్రద్దలై తన్నుయిముడ్చుకున్నా బాగుండుననుకొన్నది.

మరునాడు వుదయాన్నే తనకు జ్వరంవచ్చిందనీ, ఇవాళ భోంచెయ్యననీ లక్ష్మి దాసిద్వారా ముసలమ్మకు కబురు పంపింది.

ముసలావిడ వెంటనేవచ్చి తర్కించి తర్కించి ప్రాణం బేజారెత్తించింది. లక్ష్మి ముఖకవళిక, కంఠస్వరములను బట్టి ఆమె యేవిషయాన్నో దాయటానికి ప్రయత్నించుతూన్నట్లు ముసలమ్మకు సందేహంకలిగింది. "నీకు నిజంగానే జ్వరం తగిలిందా అమ్మా ?" అని అడిగేసింది.

లక్ష్మి తలాడించి విసురుగా "నాకు జ్వరం తగిలింది. ఏమీ తిననసటంలేదూ" అంది.

డాక్టరువస్తే "మీమందువల్ల నాకేమీ ప్రయోజనం లేదని మీకూ తెలుసుగా, దయచేయం"డని బయటనుంచే సాగనంపింది.

శివచరణుడువచ్చి ఎన్నోవిధాల అడిగి చూచాడుగాని దేనికీ సమాధానంలేదు.

మరి రెండు మూడు రోజులు యిలాగే గడిచిపోగా ఇంటిలోనివా రందరూ ఏదో అజ్ఞాతభయంతో దిగులుపడ సాగారు.

ఆనాడు పగలు మూడోజామున లక్ష్మి స్నానాల గదిలోనుంచి వచ్చి ప్రాంగణంలో ఒక ప్రక్కగా మెల్లగా అడుగులేస్తూ పైకివెళ్తోంది. ముసలమ్మ వంటింటి వరండాలో నుంచి ఆమెనుచూచి "చూడు, పెద్దకోడలా, విపిన్ పెళ్లాం ఏం చేసిందోచూడు! చివరకు చిన్నకోడలు దొంగతనానికూ్కడ దిగింది" అని అరిచింది.

హారిలక్ష్మి అక్కడికి వెళ్ళి నుంచున్నది. చిన్నకోడలు తలవంచుకుని నేలమీద చతికిలబడి వున్నది. ఒక గిన్నెలో అన్నంమీద గుడ్డకప్పివుంది. ముసలమ్మ దాన్ని చూపెడుతూ "నువ్వే చెప్పమ్మా తల్లీ, ఇంత అన్నం, కూర ఒకమనిషితిం టాడా? పిల్లాడికని ఇంటికి పట్టుకెడుతోంది!——ఎన్నిసార్లు వద్దని చెప్పినా వినకుండా. ఇదే మా శివా చెవినిపడితే ఇంకేమన్నా వుందా? మెడపట్టి బయటికి గెంటిస్తాడు. పెద్దకోడలా! ఇంటికి యజమానురాలివి, నువ్వే తీర్పు చెప్పమ్మా!" అని చెప్పి తన కర్తవ్యం తీరిపోయినట్లు మొగశ్వాస పీల్చింది.

ముసలమ్మ చీత్కారం, కేకలు విని యింటినౌకర్లు దాసీలు, ఇతరులు ఎక్కడున్నా వున్నపళంగా వచ్చిమూగారు. అంతా తమాషా చూస్తున్నారు. వా రందరిమధ్య ఆ యింటి

చిన్నకోడలు కూర్చునివున్నది. ఆమెప్రక్కనే ఆమె యజమానురాలు - అంటే ఈ యింటి గృహలక్ష్మి.

యింత స్వల్పవిషయానికి యింత గందరగోళం జరుగుతుందని లక్ష్మి కలలోకూడ ఊహించలేదు. అవమానం, లజ్జాభిమానములచే ఆమె పెదవి విప్పలేకపోయింది. ఇంక నేరారోపణకు జవాబేమిస్తుంది? ఆ సిగ్గు మరెవరికో కాదు, తనకే. ఆమె కళ్ళనుండి బొటబొట నీళ్ళు కారసాగాయి. అంతమందియెదుట తానే పట్టుబడినట్టూ, విపిన్ భార్య తన్ను విచారించటానికి కూర్చున్నట్టూ తోచింది లక్ష్మికి.

రెండు మూడు నిముషాలవరకు ఊర్కే వుండి, అప్పుడతి ప్రయత్నంమీద తన్నుతా సంబాళించుకొని "అవ్వగారూ, మీరంతా వెళ్ళిపోండి" అని చెప్పింది.

ఆమె ఆజ్ఞతో అందరూ వెళ్ళిపోయారు. లక్ష్మి మెల్లగా వెళ్ళి తోటికోడలిప్రక్కన కూర్చున్నది. చేత్తో ఆమె ముఖమెత్తి చూస్తే ఆమె కళ్ళనుంచి కన్నీటి చుక్కలు టపటప పడుతున్నవి. "చిన్నకోడలా! నేను నీఅక్కనేనమ్మా!" అని లక్ష్మి తన పైటచెంగుతో ఆమె కన్నీరుతుడిచింది.

—౧—

# భారం

సాగరపురంలో ఇవాళ మహా కోలాహలంగావుంది. మేళతాళాలతో ప్రతిధ్వనించుతోంది. వారంరోజులుగా సాగుతున్న ఈ కోలాహలంసంగతి ఈవూరుకు నాలుగైదు క్రోసుల దూరంవరకు వున్న వూళ్ళజనం అంతా యెరుగుదురు. ఇంత ప్రసిద్ధి చెందిన బజంత్రీల సమ్మేళనం యిదివర కెన్నడూ ఆ వూరుజనం చూచియెరుగరు. ఆ వివిధ వాయిద్యాలతో మనుష్య జాతి ఎంత ఆనందించినా, పశువులు-ముఖ్యంగా ఆవుదూడలు అప్రసన్నమైనాయి. డప్పులు, డోళ్ళ ఆత్మద్రోహంతో వాటి కలవరానికి మితిలేకపోయింది. ఇంత వైభవానికి కారణం పద్నాలుగేళ్ళ కుర్రవాడి పెళ్ళి! సాగరపురం జమీందారు హరదేవ మిత్రుని ఏకైక పుత్రుని వివాహసందర్భంలో ఈ హడావుడీ అంతా జరిగింది. హరదేవమిత్రుడు చాలా గొప్పవాడు. సాలీనా ఆదాయం పాతికవేలదాకా వుంటుంది. కుమారుని పేరు సత్యేంద్రకుమారమిత్ర. ఎంట్రెన్సు పరీక్షకు చదువుతున్నాడు. అతనికి ఇంత చిన్నతనంలోనే పెళ్ళి చెయ్యడానికి కారణం సత్యేంద్రునితల్లికి పీలైనంత త్వరలో కోడలిని చూచుకోవాలన్న కోరిక కలగటమే.

వర్ధమాన్ జిల్లా దిల్ జాన్ పూర్ జమీందారు కామాఖ్యాచరణ్ చౌధరి కడసారికుమార్తె సరళతో సత్యేంద్రునికి పెళ్ళయింది.

పిల్ల ఎర్రగా, అందంగా వున్నదని సత్యేంద్రుడు సంతోషంగానే వున్నాడు.

పదేళ్ళ ఆ యెర్రటి కోడల్ని చూచుకొని సత్యేంద్రుని తల్లికూడ చాల ఆనందించింది.

కోడలిని పుట్టింట్లో ఉంచడం అత్తగారికి యిష్టంలేక పోయింది. పెళ్ళయిన పిల్లని కన్నవారింట్లో వుంచడం ఎంత మాత్రం మంచిదికాదని సత్యేంద్రుని తల్లి దృఢాభిప్రాయం. అంచేత వివాహమైన మరుసటి సంవత్సరమే హరదేవమిత్ర కోడలిని తీసుకొచ్చాడు.

సత్యేంద్రుని చదివించటానికి హరదేవమిత్ర కలకత్తాలోనే కాపురం పెట్టాడు. సరళకూడ కలకత్తాకే వచ్చింది. చిన్నపిల్ల కావటంవల్ల సరళ మామగారితో మాట్లాడేది. సత్యేంద్రుడు వుండగానే అత్తగారితో మాట్లాడుతూండేది. ఇది చూచి అత్తగారికి మహాముచ్చటగా వుండేది.

కొన్నాళ్ళకు కామాఖ్యాబాబు వచ్చి సరళను తీసుకెళ్ళాడు. ఒకటి రెండునెలలు గడిచాక సత్యేంద్రు డొకనాడు "పుస్తకాలనిండా దుమ్ము పేరుకున్నది. సిరాబుడ్డిలో సిరాయే లేదు. ఇవన్నీ చూచేవారేలేరు" అన్నాడు విసుగ్గా.

తల్లి కొడుకు మాటల్లోని అంతరార్థం గ్రహించింది. హరదేవుని చెవినికూడ పడింది. ఆయన నవ్వి కోడలిని తీసుకు రమ్మని మనిషిని పంపాడు. ఆమనిషితో "ఇంట్లో మహాతంటా వచ్చిపడింది. కోడలు రానిదే అది సమసిపోయేట్టులేదు. కాబట్టి కోడల్ని ప్రయాణంచేయించి పంపండి" అని వుత్తరం రాసి పంపాడు.

సరళ మళ్ళీ వచ్చింది. సత్యేంద్రుని పనులన్నీ ఆమే దిద్దేది. పుస్తకాలు దులిపి చక్కగా సర్దిపెట్టడం, కాలేజీకి

వెళ్ళేప్పటికి దుస్తు లెంచి సిద్ధంగా వుంచడం-అంటే తొందరలో షర్టు రెండుచేతులకు రెండురకాల కఫ్సుగుండీలు కాకుండాను, భోజనానికి ఆలస్యం అయిందనో, కాలేజీ గంట కొట్టేశారనో హడావుడిలో కోటు వగైరా ఏవీ ఒకదానిబదులు ఒకటి వేసు కోవటం జరక్కుండా అన్నీ జాగ్రత్తగా సిద్ధపరచి వుంచేది. సరళ లేనప్పుడు యిలాంటి అవకతవకలు జరుగుతూనేవుండేవి. సత్యేంద్రునివంటి అన్యమనస్కుని ఇంకెవర్నీ చూచి వుండరు. ఈ పనులన్నీ సరళ తప్పితే మరొకరివల్ల అయ్యేవి కావు. ఇంకొకరు చేసినా సత్యేంద్రునికి నచ్చేవికాదు. కాబట్టి ఆ పను లన్నీ సరళే చక్కబెట్టవలసివచ్చేది.

## 2

సుశీల సరళకు పెద్దక్క. ఆమె కొడుకు అన్నప్రాశనం సందర్భంలో కామాఖ్యాబాబు సరళను తీసుకెళ్ళటానికి కలకత్తా వచ్చాడు. సుశీల చెల్లెల్ని, మరదిని తప్పకుండా రావలసిన దని కోరుతూ ప్రత్యేకంగా జాబు వ్రాసింది. సరళ మూడేండ్ల నుంచీ దిల్‌జాన్‌పూరు వెళ్ళివుండకపోవటంకూడా ఆమె వుత్త రానికి ముఖ్యకారణం. సత్యేంద్రుడు రావటానికి సమ్మతించ టంతో కామాఖ్యాబాబు పరమానందంచెంది, కుమార్తెను, అల్లుణ్ణి వెంటబెట్టుకొని తీసుకెళ్ళాడు.

సరళతల్లికూడ కూతురు, అల్లుడు వచ్చారని ఆనంద పరవశురాలైంది. సుశీల చెల్లెలికి, మరదికి ఏమేమో కబుర్లు చెప్పి సంతోషపెట్టింది.

శుభకార్యం నిర్విఘ్నంగా ముగిసినతర్వాత సత్యేం ద్రుడు ఇంటికి వెళ్తానంటే అత్తగారు "ఇన్నాళ్ళ కిప్పుడు వచ్చి అప్పుడే వెళ్లటమేమిటి? మరి కొన్నిరోజులు వుండక తప్ప"దని అభ్యంతరం చెప్పింది.

సరళగూడ అదేపనిగా చెప్పటంవల్ల సత్యేంద్రుడు మరి నాల్గురోజులు వుండడానికి అంగీకరించాడు. ఆ నాలుగురోజులు కూడ గడిచిపోయాయి. కాని సరళ అప్పుడే పుట్టిల్లువదలిపెట్ట లేకపోయింది. మరి తాను వెళ్ళకుండా వుండటానికి వీలులేదు. చదువు కుంటుపడుతుంది. పరీక్షలుకూడ యెన్నాళ్ళో లేవు. సత్యేంద్రుడు బయల్దేరి వెళ్లేటప్పుడు "మరి నన్నెప్పుడు తీసు కెళ్తారు?" అనడిగింది సరళ.

"నువ్వు వస్తానన్నప్పుడే"

"అయితే పది పన్నెండురోజుల్లోనే వచ్చి తీసుకెళ్లండి"

సత్యేంద్రునిమోము వికసించింది. అతడింత తొందర్లో నేనని అనుకోలా.

సరళ కళ్ళనీళ్లుపెట్టి భర్తను సాగనంపుతూ చెప్పింది— "నన్నుగురించే ఎక్కువగా ఆలోచించకండి. రాత్రింబగళ్ళు తెగచదివి జబ్బు తెచ్చుకోవద్దు సుమండి"

రాత్రి పదిగంటలతర్వాత చదవనని తనమీద ఒట్టే యించుకున్నది. వెళ్లలేక వెళ్లలేక సత్యేంద్రుడు వుదాసీన హృదయంతోనే కలకత్తా చేరుకున్నాడు.

సత్యేంద్రుడు పుస్తకం ముందేసుకొని కూచున్నాడే గాని అతని మనస్సు పేజీలతో ద్వంద్వయుద్ధంచేస్తోంది. లెక్క

పెడితే ఆవాళల్లా చదివింది ఇరవైఅరుపంక్తులే. ఇలాచదివితే ఇంక ప్యాసైనట్టే! నని విచారపడ్డాడు. క్రమంగా విచారం క్రోధంగా మారింది. దోషమంతా ఆ దుష్కురాలు సరళదే ననుకున్నాడు. తానువచ్చి అయిదురోజులైనా ఏమీ చదవలేక పోయాడు. మొదట్లో "చదువుకుంటూంటే వచ్చి విసిగిస్తోంది, పదిగంటలవగానే చదవకుండా దీపం ఆర్పివేస్తుంది. కాబట్టి ఆమెనెక్కడికైనాపంపివేసి బాగాచదవా"లనుకునేవాడు. కాని ఇప్పుడంతా తలక్రిందులైంది. ఏమైనాసరే, రేపే వెళ్ళి ఆమెను తీసుకు రానలెననుకున్నాడు. "తీసుకురాటానికి సిగ్గుపడి పరీక్ష తప్పుతానా?" అనుకున్నాడు.

సత్యేంద్రుడామెను పిలిపించడానికి వుపాయమేమిటా అని ఆలోచించుతున్నాడు. పెద్దవాళ్ళతో ఏమనిచెపుతాడు? సిగ్గువేస్తుంది చెప్పటానికి. ఆమెయందింత ప్రేమ ఎలాకుదిరిందో! రెండురోజులు—

ఇలా ఆలోచించుకొనుచుండగానే నౌకరువచ్చి టెలిగ్రాం యిచ్చాడు. సత్యేంద్రుడు విస్మితుడయ్యాడు. ఇంక ఆలోచించేందుకు అవకాశంలేదు. కవరువిప్పి చూడగానే సత్యేంద్రుని గుండె గుభేలుమన్నది; లోపలి విషయం చదువుటతో అతనికి తలతిరిగింది. సరళకు జబ్బుగావుంది!

హరదేవబాబు సత్యేంద్రునితో ఆనాడే దిల్‌జాన్‌పూరుకు ప్రయాణమై వెళ్ళాడు. వాకిట్లో వారికి కామాఖ్యాబాబు కలిశాడు. "కోడలికి యెలావుంది?" అని హరదేవబాబు కంగారుగా అడిగాడు.

హారదేవబాబు లోపలికివెళ్ళిచూచాడు. సరళకి స్ఫోట కంపోకింది. ఒక్కరోజులోనే ఆమె ఆనవాలుపట్టడానికి వీల్లే నట్టయిపోయింది. కళ్లు దించుకుపోయాయి. పద్మంలాంటి మొహంమీాద తారుపూసినట్టుంది. పరిస్థితి బాగాలేదని హార దేవబాబు గ్రహించాడు. కళ్ళుతుడుచుకుంటూ "అమ్మాంయ్ సరళా!" అని పల్కరించాడు.

సరళ కళ్ళువిప్పి చూచింది. అప్పటికింకా ఆమె స్పృహ లో వుంది.

"ఎలా వున్నదమ్మా ?"

సరళ నవ్వి "బాగానేవున్నాను" అన్నది.

ఆయన అక్కణ్నుంచి వెళ్లిపోయినతర్వాత సత్యేంద్రుడు దగ్గరకుపోయి కూర్చున్నాడు. దారుణవ్యథవల్ల అతనినోట మాటేరాలేదు. బలవంతాన తేచీలేవని నీరసకంఠస్వరంతో "సరళా!"అని పిల్చాడు. కాని ఆస్వరంలో జీవంలేదు. అయితే యేం? అదే చిరపరిచితస్వరం, అదే ప్రేమపిలుపు – సరళా! అందులో పొరపాటేముంటుంది? సరళ కళ్ళుతెరచి చూచింది. ఆమె హారదేవబాబును చూచినప్పుడే సత్యేంద్రుడు వచ్చి వుంటాడనుకొన్నది. మామూలుగా భర్తతో సరసమాడటం ఆమె కిష్టం. నవ్వి "ఏం, తీసుకెళ్ళటానికి వచ్చారా?" అన్నది.

ఇంక మాటఆగిపోయింది. సత్యేంద్రుడు సరళ స్థితిని చూచి అంతవరకు ఎలాగో కన్నీరాపుకున్నాడు గాని, ఇంక ఆ యిసుక కట్ట ఆగక తెగిపోయింది.

ఆ పరిస్థితిలో ఏడ్వరాదని సత్యేంద్రునికి తెలుసు. కాని మండిన కళ్ళ కంత తెలివెక్కడిది ? కన్నీళ్లు మెల్ల మెల్లగా

ఒక్కొక్క బొట్టే టపటప పడసాగినై. నే డవి సరళ అవ యవాల్లో కలిసిపోతున్నాయి. వాటి కట్టి అవకాశ మిదివర కెప్పుడైనా లభించిందా? ఎన్నడూ లేదు. అవి అతన్ని చూచీ, సరళనుచూచీ అవకాశాన్ని వదుల్తాయా? ఉఁహూఁ, సరళ భర్త కన్నీళ్ళు పెట్టడం ఎన్నడూ చూళ్ళేదు. ఆమెకూడా యేడ్చింది. చాలా సేపటికి కన్నీళ్ళుతుడుచుకొని "ఛీ! యేడుస్తా రెందుకు? మగవారు యేడుస్తారా?" అన్నది.

ఇదేమిటి? నిజమే సరళా, బాగా చెప్పావు. అంతర్దా హంతో అవి యెండి కరుడుగట్టిపోవాలేగాని, ఒక్కచుక్కైనా బయటికి రాకూడదు. కన్నీళ్లు స్త్రీలకు మాత్రమే. ఆ విష యంలో పురుషులకు హక్కులేదు. మర్మాంతిక వేదనతో మాడి మసైపోవాల్సిందే గాని, ఏడ్వటానికి వీల్లేదు. ఏడిస్తే ఆడదైపోవటమే! సరళా; ఇది మీరుచేసిన ఏర్పాటేనా?

సరళ పతిచేతిని చేతిలోకితీసుకొని నొక్కుతూ "మీరు పునర్జన్మ నమ్ముతారా?" అనడిగింది.

సత్యేంద్రుడు ఏడుస్తూనే "నమ్మేవాడినో లేదో తెలి యదుకాని, ఇకముందుమాత్రం నమ్ముతాను" అన్నాడు.

సరళ మొహంమీద హాసరేఖ తొలుకాడింది. మంతు త్రాగించే వేళ కావడంవల్ల కామాఖ్యా, హరదేవ, డాక్టరు బాబులు గదిలోకి వచ్చారు. డాక్టరు నాడిచూచి "పెద్దగా ఆశలేదు; అయినా ఈశ్వరేచ్ఛ!" అన్నాడు మెల్లగా.

ఈశ్వరేచ్ఛతోనే మరునాడు వుదయం ఏడుగంటలకే సరళ ప్రాణం విడిచింది. ఆసాయంత్రమే హరదేవబాబు సత్యేం దుని తీసుకొని కలకత్తా తిరిగివచ్చాడు.

# 3

ఏమి జరుగుతుందో ఏం తెలుస్తుంది? రాజపాన్పుపై పవళించి ఇంద్రభోగాన్ని అనుభవించుతూండగా, అంతలో ఎవరోవచ్చి, కుదిపి లేపి ఆ యావత్తుసుఖాన్నీ మట్టిలో కలిపేశాడు. అర్ధరాత్రివేళ లేచికూచున్నాను. నిద్రతేలిపోయింది. నా జీవితసహచరిపక్కమీదే పడివున్నాను. నేను ఏడ్వనా? నవ్వనా? సుఖవాహినిలో అనంతాకాశంవేపు ప్రవహించిపోతున్నాను. అంతలో ఎవరో తెలియనివారి వల్లో చిక్కుకున్నాను. ఇంక తప్పించుకొని వెళ్ళలేనేమో! అంతా తల క్రిందులైంది. నా జీవితకేంద్రాన్ని సహితం లాగివేసి దాని హద్దుల్ని దాటించి తీసుకుపోయాడు. ఏమీఆలోచడంలేదు. ఏమిటి యిలా అయిపోయింది!—నిశిరాత్రివేళ కిటికీవద్ద కూర్చుని సత్యేంద్రుడు ఆలోచిస్తూ అంధకారంలోకిచూస్తున్నాడు. చెట్లు, పొదలు సత్యేంద్రునితోపాటు నిస్తబ్ధ భావాన్ని ప్రదర్శించుతూన్నై.

నిశిపవనం "సాఁయ్, సాఁయ్" అంటూ పోయింది. అదేమైనా చెప్పిపోయిందా? ఆ, చెప్పేపోయింది - ఆమాటే, అన్నీ ఆమాటే-జరిగిపోయిన సంగతే చెప్తూ తిరుగుతున్నాయి. చాతకపక్షీ అదే, తీతువూ అదే చెపుతున్నాయి-ఆమెమృతిని గురించి. అన్నీ ఆమాటే చెపుతూ తిరుగుతున్నాయేఁ! ఏది-చెప్పినా - లేదు, లేదు. ఆమె యింక లేదు"అనేనే!

ఒంట్లో ఎలావుంది సత్యేంద్రా? తలనొప్పి ఎక్కువగా వున్నదా? అది జరిగి చాలారోజులైపోయింది. కాస్సేపుపడుకో భాయీ! ఎప్పుడూ యిలాగే ఆ కిటికీ వద్దనే కూర్చుంటావా?

సత్యేంద్రుడు అంధకారంలోంచి నక్షత్రాలు - వాటిలో మరీ క్షీణకాంతి గలదాన్ని మరీ రెప్పవాల్చకుండా చూస్తుంటాడు. కళ్లు మూస్తే అది మళ్లీ కన్పిస్తుందో లేదోనని భయం! చూచి చూచి అలసిపోతే అక్కడే నిద్రపోతాడు. తెల్లవారి కళ్లు తెరవగానే మళ్లీ ఆ చిన్ని తారనే చూట్టానికి ప్రయత్నిస్తాడు. ఇప్పు డతనికి వెల్తురు పడదు. వెన్నెల అతని కానందాన్నివ్వ టంలా. పగటివెల్తురులో అంత కాంతిహీన నక్షత్రం కనపడు తుందా ?

సత్యేంద్రుడు ఎం. ఏ. తప్పాడు. యింక ప్యాసయ్యే ఆశా లేదు. ఉత్సాహామే చల్లబడిపోయింది. ప్యాసైతేమాత్రం ఆ తార దగ్గరకొస్తుందా ?

హరదేవబాబు సపరివారంగా స్వగ్రామానికి వచ్చేశాడు. రాక ఏంచేస్తాడు? ఇంటివద్దే బాగా చదవగలననీ, పట్ణంలో గోల గలభాలల్లో చదువు సాగదనీ సత్యేంద్రుడు అంటూండే. సత్యేంద్రు డిప్పుడు మరోలా మారిపోయాడు. అతని మొహంచూస్తే ఏదో పెద్దజబ్బుతో లంఖణాలు చేసిచేసి యిప్పుడే బయటపడినట్లనిపిస్తుంది.

సత్యేంద్రుడు మధ్యాన్నం ఫొటోలు దుమ్ముదులిపి తుడుస్తాడు. తన పాతపుస్తకాలు సర్దుతాడు. హార్మోనీ మూత తీసి వూరకే శుభ్రపర్చబోతాడు. సరళ శుభ్రంగా సర్దివుంచిన పుస్తకాలను ఇంకా బాగా సర్దజూస్తాడు. మంచిమంచి కాగితాలు, కవర్లు ఏరి సరళకి జాబులు రాస్తాడు. ఏమేమి చిరునామాలు రాస్తాడోగాని, అన్నీ తనపెట్టెలో దాచుకుంటాడు. సత్యేంద్రా! నువ్వొక్కడవేకాదు. నీలాగా అల్పవయస్సులోనే

ఎంతోమందిఅదృష్టం మండిమసైపోతుంది. వాళ్లంతా నీలాగే పిచ్చివాళ్లవుతున్నారా? జాగ్రత్త సత్యేంద్రా! ప్రతిదానికీ ఒక హద్దుంటుంది. ప్రేమకుకూడ ఒక హద్దు నిర్దిష్టమైవుంది. ఆ హద్దును దాటిపోయావో, కష్టాలపాలవుతావు సుమా!

సత్యేంద్రునితల్లి చాల తెలివిగలది. ఆమె ఒకనాడు "మన సత్యేంద్రుడు ఎలా అయిపోయాడో చూస్తున్నారా?" అని భర్తతో అన్నది.

"చూస్తూనేవున్నానుగాని, ఏంచేస్తాం మరి?"

"రెండోపెళ్ళి చెయ్యండి. మంచికోడలువస్తే నా సత్యం మళ్ళీ నవ్వుతాడు. మాటల్లో పడతాడు.

ఆవాళ సత్యేంద్రుడు భోంచేస్తూండగా "నా మాట వింటావా నాయనా?" అనడిగింది తల్లి.

"ఏమిటి?"

"నువ్వు మళ్లీ పెళ్ళిచేసుకో బాబూ"

సత్యేంద్రుడు నవ్వి "అదా సంగతి! అయినా ఈ వయసులో యింకా పెళ్లెందుకమ్మా" అన్నాడు.

తల్లి ఇన్నాళ్లనుంచి దుఃఖాన్ని దిగమ్రింగుతోంది. ఇంకిప్పుడు కన్నీరాగలేదు. కళ్లుతుడుచుకుంటూ "ఇరవైయేళ్లూ ఒకవయసేనంటావా అబ్బాయ్? సరళ జ్ఞాపకంవస్తే ఈ మాట నోటిమీదికి తేలేకుండానే వున్నాను. కాని ఇంక చెప్పకుండా వుండలేకపోయానురా" అంది.

మరునాటి ఉదయాన హరదేవబాబుకూడ కుమారుని పిల్చి ఆ మాటే చెప్పాడు. సత్యేంద్రుడు ఏమీ జవాబివ్వలా. మౌనం అంగీకారసూచనే ననుకున్నాడు తండ్రి.

సత్యేంద్రుడు తన గదిలోకివచ్చి సరళ ఛాయాపటం ముందు నిలబడి "వింటున్నావా సరళా! నాకు పెళ్ళవుతుంది!" అన్నాడు. కాని పటం మాట్లాడుతుందా ? మాట్లాడగల్గినా ఏమంటుంది? "మంచిదే" నంటుంది, ఇంకేమంటుంది?

# 4

సత్యేంద్రుని వివాహం ఈసారి కలకత్తాలో జరిగింది. సత్యేంద్రుడు పెళ్ళిచూపులకు వెళ్ళాడు. చాలా అందమైన ముఖం. "అందమైనదేకానీ, మళ్ళీ ఇదో భారం నెత్తిమీద!" అనుకున్నాడు సత్యేంద్రుడు తనలో.

పెళ్ళయాక నళిని రెండేళ్ళు పుట్టింట్లోనేవుంది. మూడో యేట అత్తవారింటికి వచ్చింది. అత్తగారు పున్నమచంద్రుని బోలు కొత్తకోడలిమొహం చూచుకొని సరళను మరచిపో ప్రయత్నించింది. దిగులు తగ్గి మళ్ళీ యిల్లు చక్కబెట్టుకో సాగింది. రాత్రులందు నళినీ సత్యేంద్రు లొక్కచోటే పడుకున్నా ఒకరొకరితో మాట్లాడేవారుకాదు.

ఏమి టీ ఉపేక్ష? అని నళిని ఆలోచించుకునేది.

ఈవిడ ఎవరు నా సరళస్థానంలో పడుకుంటోంది? అని సత్యేంద్రుని ఆలోచన. కొత్తకోడలు సిగ్గుచే పతితో మాట్లాడేదికాదు. మాట్లాడకపోవటమే మంచిదనుకునేవాడు సత్యేంద్రుడు. ఒకనాడు అర్ధరాత్రివేళ సత్యేంద్రునికి మెలకువ వచ్చి చూడగా పక్కలో నళిని లేదు. చీకట్లో నిదానంగా చూడగా ఆమె కిటికీవద్ద కూర్చునివుంది. కిటికీ తెరిచేవుంది. లోపల వెన్నెలపడుతోంది. ఆ వెల్తుర్లోనే సత్యేంద్రునికి నళినిమొహం

కనపడింది. నిద్రమత్తులో - వెన్నెల కాంతిలో ఆమెమోము చాల అందంగా కన్పించింది.

ఆమె ఏడుస్తున్నధ్వని విన్నాడు. "నళినీ !" అని పిల్చాడు. నళిని వులిక్కిపడింది. భర్తపిలుస్తున్నాడు. ఇంకెవరైనాఅయితే ఏంచేసేదో! కాని, మెల్లగా వచ్చి ప్రక్కనే కూర్చున్నది.

"ఏడుస్తున్నావా? ఎందుకేడుస్తావు? అనడిగాడు సత్యేంద్రుడు. ఆమె కన్నీటిప్రవాహం మరీ జోరైనది. ఆ పదహారేండ్ల ప్రాయంలో యిదే భర్త తొలిప్రేమ పలుకు.

చాలసేపు కుమిలి కుమిలి ఏడ్చి, కళ్ళుతుడుచుకొని మెల్లగా అన్నది—"నేనంటే మీ కెందుకు యిష్టంలేదు ?"

ఎందుకో తెలియదుగాని, సత్యేంద్రునికి లోపల్నుంచి ఏడ్పు ముంచుకొచ్చింది. దాన్నాపుకుంటూ "నీ మంచిచెడ్డలు కనుక్కోనిమాట నిజమేననుకో. నా కిష్టంలేదని ఎవరన్నారు?" అన్నాడు.

నళిని మాట్లాడకుండా వింటోంది.

సత్యేంద్రుడు కొంచెమాగి మళ్లీ చెప్తున్నాడు—"అసలీ సంగతి ఎవరితోనూ చెప్పవద్దనే అనుకున్నాను. చెప్పినా ప్రయోజనంలేదు. నీముందు దాచడమెందుకు? అన్నీ విప్పి చెప్తే నేనిలా ఎందుకుంటున్నానో నువ్వే గ్రహించుతావు. నే నిప్పటికీ సరళను - నా మొదటిభార్యను మరచిపోలేకపోతున్నాను. మరచిపోతానన్న నమ్మకమూ లేదు. మరచిపోవాలన్న కోరికాలేదు. నువ్వీ దౌర్భాగ్యునిపాలబడ్డావు. నిన్నేనాటికైనా సుఖపెట్టగలననే ఆశాలేదు. నేను ఇచ్ఛాపూర్వకంగా నిన్ను పెళ్లాడలేదు. మరి కోరి ప్రేమించలేనుకూడాను"

ఆ గంభీర నిశీథిని యిద్దరూ అలాగే చాలసేపటివరకు కూర్చున్నారు. నళిని ఏడుస్తున్నదని తెలుసుకున్నాడు. అతడూ యేడ్చాడేమొ! ఒకటొకటిగా సరళ మాటలుజ్ఞాపకంవస్తున్నై. మనోవీధిని ఆమె మోమే కన్పడుతోంది. "ఏం" తీసుకెళ్ళడానికి వచ్చారా?" అన్న మాట జ్ఞప్తికొచ్చింది. పిలవని పేరంటంగా కన్నీళ్ళు కమ్ముకొచ్చి సత్యేంద్రుని దృష్టి నాటంకపర్చాయి. తర్వాత అవి క్రమంగా చెంపలమీద పడసాగినై.

కళ్ళుతుడుచుకొని సత్యేంద్రుడు నళిని రెండుచేతులూ తీసుకొని "ఏడవకు నళినీ! ఇందులో నాదేముంది చెప్పు? రేయింబగళ్ళు లోలోన నే నెంత కుమిలిపోతునన్నానో ఎవరికీ తెలియదు. హృదయంలోని ఈ దుఃఖం దూరమైపోతే బహుశ నిన్ను ప్రేమించగల్గవచ్చు.అప్పుడు నిన్నుసుఖపెట్టగలనేమొ." అన్నాడు.

విషాదంతో కూడిన యీ వాత్సల్య భరితశబ్దాల విలువ నెందరు అర్థంచేసుకోగలరు? నళిని చాల తెలివిగలది. ఆమె భర్త దుఃఖాన్ని గ్రహించింది. పతి తన్ను ప్రేమించటం లేదన్న సంగతిని ఆయననోటే విన్నది. అయినా ఆమె అలగలా. స్వాభిమానంతో బాధపడలా. పిచ్చిపిల్ల!పదహారేండ్ల ప్రాయం లో అలగకపోతే ఇంకెప్పుడు? కాని నళిని ఆలోచన వేరు. అల గటం, అభిమానంతో కోపగించుకోవటం ముఖ్యమా, భర్త ముఖ్యమా? ఇదీ ఆమె యోచన.

నాటినుంచీ పతి దుఃఖం పోవడానికి మార్గమేమిటా అన్నదే నళిని నిరంతరాలోచన. ఏంచేస్తే భర్త సవతిని మరచి పోతాడా అని ఆమె ఒక్కసారైనా ఆలోచించలేదు. వ్యథిత

హృదయునికి ఆవ్యథలో భాగం పంచుకొనే వ్యక్తీ, కష్టంలో సానుభూతి చూపేవారూ, దుఃఖగాథను ఆసక్తితో వినేవారూ లభించితే-అంతకంటే ఈ లోకంలో ఆప్తులింకొకరు వుండరు.

అప్పట్నుంచి సత్యేంద్రుడు తరచుగా తన వెనుకటి సంగతులు నళినితో చెప్తూండేవాడు. ఇలాగే వారి కనేక రాత్రిలు గడిచిపోసాగాయి. కేవలం సత్యేంద్రుడు చెప్పుకుపోవడమేకాదు, నళినికూడ ఎంతో ఆసక్తిగా భర్త చెప్పేదాన్ని వినాలని కుతూహలంగా వుండేది.

# 5

రెండేళ్లు గడచిపోయాయి. నళినికిప్పుడు పద్దెనిమిదేండ్లు ఇప్పుడామెకు పూర్వంలాగా కష్టంలేదు. భర్తయిప్పుడామెను అనాదరణచెయ్యటంలేదు. ఆమె ఎలాగైతేనేం పతి ప్రేమను సంపాదించింది. బలవంతంగా పొందగలిగినవారికి నిలుపుకోవటం కూడా తెలుసు. ఇప్పుడామె కెలాంటికష్టమూలేదు. సత్యేంద్రుడిప్పుడు పాట్నాలో డిప్యూటీ కలెక్టరు. భార్య కృషి, సేవా శుశ్రూషలు,అచంచల ప్రేమ అతనిలో చాలా పరివర్తనం తీసుకొచ్చాయి. ఆఫీసునుంచి వచ్చి నళినితో కబుర్లు చెప్పుకుంటూనో, సరసాలాడుతూనో,గానా-బజానాకార్యక్రమంతోనో ఆనందం పొందుతూండేవాడు. ఒకక్క-మాటలో చెప్పాలంటే సత్యేంద్రుడిప్పుడు చాలవరకు మనిషయ్యాడు. మానవునికి సామాన్యంగా అలభ్యవస్తువునందే అధికప్రేమ ఏర్పడుతుంది. మనిషిచరిత్రే అంత. నీవు అశాంతిలోవున్నావో, శాంతిని వెతుక్కుంటూ తిరుగుతున్నావో-నేనుశాంతిగానే రోజులు గడుపు

తున్నాను. అయినా ఎక్కణ్నుంచో అశాంతిని ఈడ్చుకొస్తూ నేవున్నాను.

కపటాన్ని వెతికి పట్టుకోవటం మానవుని స్వభావసిద్ధ గుణం కాబోలు! పారిపోయిన చేపే పెద్దదవుతున్నదా? సత్యేంద్రుడూ మనిషే. మనిషి స్వభావం యెక్కడికి పోతుంది? ఇంత ప్రేమ, కృషి, శాంతిలోకూడ అతనిహృదయంలోఅప్పుడప్పుడు అశాంతి మెరుపులా తళుక్కుమనేది. రెప్పపాటులో అతని మనస్సులో విద్యుత్ క్రియలా వ్యాపించే ఆ మార్పును అదుపులో పెట్టేందుకు నళిని ఎంతో శ్రమపడాల్సివచ్చేది. ఆమె మధ్యమధ్య తానింకసంబాళించలేననీ,తనఇన్నాళ్ళప్రయత్నము, కృషి – అంతా వ్యర్థమైపోతుందనే అనుకొనేది. ఏమాత్రం నళినివల్ల లోపంజరిగినా సరళవుంటే అలాజరిగేది కాదనుకుంటూండేవాడు సత్యేంద్రుడు. కావచ్చు కాకపోవచ్చు. అదిదేవునికే ఎరుక-ఆలోపం జరుగకపోనూవచ్చు, ఇంకా అధికలోపమూ జరుగవచ్చు. కాని ఏమిటి యిందువల్ల? ఆ చేప పారిపోయిందే! సత్యేంద్రుడిప్పటికీ సరళను మరువలేకపోయాడు. ఆఫీసునుంచి వచ్చునప్పటికి నళినికన్పించకపోతేసత్యేంద్రుడు వెంటనే "ఆమె యెక్కడ, ఎక్కడ యీామె!" అనుకొనేవాడు.

నళిని తెలివిగలది కాబట్టి సత్యేంద్రు డింకా సరళను మరచిపోలేదని గ్రహించి, సదా అతనికి సమీాపంలోనేవుండేది. ఒక్కసారిగా మరచిపోగలడని ఆమె యెన్నడూ తలచలేదు. వృథాగా జ్ఞాపకంచేసుకొని అవస్థపడుతున్నమాట నిజమే. అందువల్ల ఆమెభర్తను అంటిపెట్టుకొని వుండడానికే ప్రయ

శ్నించేది. ఆమెను పతి నిరాదరించడంలేదుగా - అంతేచాలు నళినికి-అనే విషయం మరువకండి.

గోపీకాంతరాయి పాట్నాలో పేర్వడసిన వకీలు. కలకత్తాలో ఆయన యిల్లు నళిని పుట్టింటికి పొరుగిల్లే. దూరపు సంబంధ మేదోవున్నందున రాయిని బాబాయి అనీ, ఆయన భార్యను పిన్ని అనీ పిలుస్తుంది నళిని. ఆభార్యాభర్తలిద్దరు తరచుగా నళినియింటికి వస్తూండేవారు. పరిచయంకొద్దీ సత్యేంద్రుడుకూడ రాయిమామగారంటే బాగా యిష్టంగా వుండే వాడు. ఇక్కడవారిద్దరియిళ్ళూ చాలదూరంగావున్నా వుభయ కుటుంబాలకు అన్యోన్యత బాగాఏర్పడింది.

నళినికూడ బాబాయిగారి యింటికి - బాబాయిగారి యిల్లనేగాక, ఆయనకుమార్తె హేమ బాల్యస్నేహితురాలు కావటంవల్లకూడ - వెళ్ళివస్తూండేది. ఆవాళ పన్నెండు గంటలయింది. సత్యేంద్రుడు ఆఫీసుకువెళ్ళిపోయాడు. ఏమీతోచక నళినిచిత్రమొకటి చిత్రించడానికి కూచుంది, కాని అప్పుడే దడదడలాడుతూవచ్చి వాకిట్లో ఆగింది ఒక బండి.

"ఎవరూవచ్చింది ? హేమవచ్చివుంటుంది" అనుకున్నంతలో హడావుడిగా హేమాంగిని రానేవచ్చింది. వచ్చీరావటంతోనే హేమ నళినిజుట్టుపట్టుకొని "ఇంక అన్నీ రాశావుగాని, లే; లే, మాయింటికి పోదాం రా, నిన్న మాఅన్నయ్య పెళ్లాం వచ్చింది, చూద్దువుగాని" అన్నది.

"కోడలు వచ్చిందా? మరి వెంటతీసుకురాలేదేం?" అంది నళిని. "అదెట్లా? కొత్తగావచ్చిందాయె. అప్పుడే మీ ఇంటికెలావొస్తుందోయ్ ఒక్కసారిగా !"

"అయితే నేనుమాత్రం యెందుకొస్తాను?" అన్నది నళిని

హేమాంగిని నవ్వి "నువ్వు రావటం ఒక రావటమా! నే నిప్పుడే ఈడ్చుకెళ్ళనూ?" అంది. జుట్టుపట్టుకు లాక్కెళ్తే ఒక్క నళినేనన్నమాటేమిటి చాలామంది వెళ్తారు. మరి నళిని ఎలా తప్పించుకుంటుంది. వెళ్ళింది.

వెళ్ళటమంటే నళిని కాలోచనే! హేమయింటికి వెడితే మళ్ళీ తిరిగిరావటానికి ఎలాగూ ఆలస్యమౌతుంది. ఒకటి రెండు దఫాలు తానురాకముందే సత్యేంద్రుడు ఇంటికి చేరుకోవడం జరిగింది. తను తైనాతుగా లేకపోతే అతనికి ఇబ్బందే. ఆయన ఏమైనా అనుకున్నా అనుకోకపోయినా నళినికి సిగ్గువేస్తుంది. మరి భర్త ఆఫీసునుండిరాగానే తాను కాస్సేపు విసిరితేగాని అతని వేడి శాంతించదని ఆమెకు తెలుసునుగా. విధి విధానం! ఎంత ప్రయత్నించినా నళిని రాత్రి ఏడుగంటలు కాకముందే రాలేకపోయింది. తీరా యింటికివచ్చిచూస్తే సంత్యేంద్రుడు భోంచేయకుండానే పత్రిక చదువుకుంటున్నాడు. అసలతనికి భోజనం తానే వడ్డించేది ఎప్పుడూను.

నళిని సమీపించగా సత్యేంద్రుడు చిరునవ్వు నవ్వాడు కాని నళిని సంతృప్తిపడలేకపోయింది. లోలోన భయంతో కంపించిపోయింది. పీటవేసి భోజనంవడ్డించి, ఎంతగానో ప్రయత్నించిందిగాని సత్యేంద్రుడు ముట్టలేదు. "ఆకలి లే"దని మాత్రం అన్నాడు. ఎంత బ్రతిమాలినా అతడేమీ తిననే లేదు. ఎందుకింత అలిగాడో నళినికి తెలుసు.

# 6

హేమాంగిని ఇవాళ అత్తవారింటికి వెడుతోంది. ఆమె భర్త ఉపేంద్రుడు తీసుకెళ్ళటానికి వచ్చాడు. నళిని ఈ మధ్య హేమను కలుసుకోనేలేదు. అంచేత మరీ మరీ రాసింది హేమ నళినిని వచ్చి చూచిపొమ్మని.

నళిని భర్తకు చెప్పకుండా ఇంకెక్కడికీ పోవద్దనుకుంది. కాని తన ప్రతిజ్ఞ ప్రకారం నడవాలంటే ప్రియసఖిని చూడటమే పడదు. నళినికి పెద్దచిక్కే వచ్చింది. మూడుగంటల బండికే వెడుతున్నానని హేమ రాసింది. మరి ఈలోగా భర్త అనుమతి పొందడం ఎలా సంభవమౌతుంది? క్రిందు మీదు లాలోచించి నళిని వెళ్ళటానికే నిర్ణయించుకున్నది. వెళ్ళేప్పుడు సరీగ్గా మూడుగంటలకల్లా తనకోసం రాయిబాబుగారి యింటికి బండి పంపమని చెప్పింది దాసితో. అలాగే బండి వెళ్లింది కూడాను; కాని హేమప్రయాణం మూడుగంటల రైలుకు సాగలా. కాబట్టి హేమ ఏవిధంగాను నళినినివదలిపెట్టదయ్యెను. ఎంతమూర్తి౦చినాకూడా నళిని హేమను తప్పించుకురాలేక పోయింది. హేమ మళ్ళీ ఎన్నాళ్ళకు వస్తుందో, మరి అంత తేలికగా వదిలిపెడుతుందా!

ఇంటికి ఆలస్యంగా వెళ్తే భర్తకుకోపంవస్తుందని చెప్పడానికి నళిని సిగ్గుపడింది. అయినా ఎవరుమాత్రం ఎలా చెపుతారు అట్లని? అందులోనూ ఆ వయస్సులో! అయినా తుదకు నళిని ఆమాటకూడ చెప్పివేసింది; కాని హేమ నమ్మలా. నవ్వి "నన్ను తెలివితక్కువదాన్ననుకోకు. ఈ కోపం గీపం సంగతినాకూ తెలుసు. ఉపేంద్రబాబూమంచికోపదారే!" అంది.

ఈ విధంగా హేమ నళిని మాటను నవ్వుక్రింద త్రోసే సింది. నళినికి నిజంగా మనసులో కష్టం కలిగింది. అందరి భర్తలూ ఒకేమూసలో పోతపోయబడ్డారా? అంతా ఉపేంద్ర బాబులాంటివారేనా ?

నళిని యింటికిచేరేటప్పటికి రాత్రి పదిగంట లయింది. భర్త బయట పక్క వేయించుకొని నిద్రపోతున్నాడని విన్నది.

మాతంగిని నళిని పుట్టింటి దాసి. ఆమెకు నళినియం దమిత వాత్సల్యం. అంచేతనే యివాళ ఆమె నళినిని చెడా మడా చీవాట్లుపెట్టింది. సత్యేంద్రుడు క్రోధాధిక్యత వల్లనే బయట పక్క వేయించుకున్నాడని ఆమెకు తప్ప యింట్లో యింకెవ్వరికీ తెలియదు.

ఆ గాఢాంధకారంలో సత్యేంద్రుడు కళ్ళు మూసుకు పడుకొని తన పూర్వస్మృతులకు నవ్యత్వాన్ని చేకూర్చప్రయ త్నించుతున్నాడు. చాలాకాలంగా అదృశ్యమైన వికసితపద్మం లాంటి సరళ మొహానికీ నళిని మొహానికీ సాదృశ్యమున్నదా లేదాఅని ఆలోచించుతున్నాడు. సరళప్రేమముందు నళిని ప్రేమ సముద్రజలం ముందు గోవుఅడుగులోని నీరువలె వున్నట్టు అతని మనోవీధిని తుపాను రేగుతున్న సమయంలో నళిని వచ్చింది మెల్లగా. సత్యేంద్రుడు కళ్ళెత్తిచూచాడు, నళినే. ఆమెవచ్చి అతని పాదాలచెంత కూర్చున్నది. సత్యేంద్రుడు కళ్ళుమూసుకున్నాడు. చాలాసేపు ఇలాగే గడచిపోయింది. సత్యేంద్రుడికి కోపంవచ్చింది. ప్రక్కకుబత్తిగిలి "నువ్విక్క డెందుకు?" అన్నాడు పురుషదర్పంతో

నళిని ఏడుస్తోంది. ఏమీ మాట్లాడలేకపోయింది. ఏడ్పువిని డిప్యూటీ కలెక్టరుగారు మరింత కోపంతో "చాలా ప్రొద్దుపోయింది. లోనికిపోయి పడుకో" అన్నాడు.

నళిని కళ్ళుతుడుచుకుంటూ "మీరూ పదండి పడుకుందురుగాని" అంది.

నాకు బాగా నిద్రవస్తోంది యిప్పుడులేవలేను."

ఏడిస్తే సత్యేంద్రునికి మరీకోపం. నళిని కన్నీళ్లు తుడుచుకున్నది. ఇంక భర్తముందు ఏడ్వకూడదనుకుంది. నెమ్మదిగా భర్తపాదాలుపట్టుకొని "ఈ సారి నన్ను క్షమించండి. ఈ ఆరుబయట మీకు మంచిదికాదు. లోపలికిరండి"అన్నది.

లోపలికి పోకూడదని సత్యేంద్రుడు ప్రతిజ్ఞ పూనాడేమో! "ఇంతప్రొద్దుపోయినాక కష్టంసంగతి ఆలోచించాల్సిన అవసరంలేదు. నువు పోయిపడుకో, నేనూ నిద్రపోతాను," అన్నాడు. సత్యేంద్రునిస్వభావం నళినికి తెలుసు. ఆమె తనగది లోకివెళ్లి తెల్లవార్లూ ఏడుస్తూగడిపింది. కోపం గీపం సంగతి బాగా తెలుసన్నదే, ఏదీ ఆ హేమాంగిని వచ్చిచూస్తే బాగుండును! ఈ తగాదాను తీరుస్తుందా!

సత్యేంద్రుడు మర్నాడు యింట్లోకి పోనేలేదు. నళినికి కనపడనూలేదు.

నళిని ఒకచీటీవ్రాసి మాతంగితో పంపింది. సత్యేంద్రుడు విప్పి చదవకుండానే చించిపారేసి "ఇలాంటివేమీ మళ్లీ తేవల"దని చెప్పాడు.

నాలుగైదురోజులతర్వాత నళిని అన్న నరేంద్రబాబు పాట్నావచ్చాడు. సోదరునిరాకతో నళిని చాల సంతోషిం

చింది, కాని, అంతకంటే అధికంగా ఆశ్చర్యపడింది. అకస్మాత్తుగా వచ్చాడేమిటి ? నరేంద్రబాబు నళినిని కలుసుకొని నవ్వుతూ "మన యింటికిరావాలని అంత తొందరపడ్డావేమిటి అమ్మాయ్?" అన్నాడు.

"తొందరపడ్డానా !"

అంతలో నళినికి అంతా అర్థమయింది. నవ్వుతూ "మిమ్మందర్నీ చూచి చాలారోజులైందిగా అన్నయ్యా!" అంది.

నళిని పతికి పాదాభివందనంచేసి సోదరునివెంట పుట్టింటికి వెళ్ళిపోయిన నాటి రాత్రి సత్యేంద్రుడికి ఒక్కనిమిషమైనా కన్నుమూతపడలా. ఇలాచెయ్యకపోయినా పని జరిగేదని తెల్లవార్లూ ఆలోచించాడు. ఇంకాఅవకాశంవుంది. ఇప్పుడైనా తిప్పితీసుకురావచ్చునని చాల ప్రొద్దుపోయేవరకు మనస్సులో అనిపించింది. కాని, స్వాభిమానం ! పౌరుషంవల్లనే నళినిని తిప్పితీసుకురాలేకపోయాడు.

మాతంగినికూడ నళినితో వెళ్ళింది. ఈ పనిచేయడానికి కారణం దాని కొక్కదానికే తెలుసు. ఈవిషయం ఏమాత్రం అక్కడ బయటపెట్టవద్దని నళిని దాసిని కట్టడిచేసింది. ఈసంగతి బయటపడితే భర్తకు అపఖ్యాతి వస్తుందనినళినితలంపు. మంచివాడుకానీ, కాకపోనీ, తనపతిని చెప్పుకోవటానికి లోకులెవరు?

నళిని పుట్టింటికిచేరి, తల్లిదండ్రులకు పాదాభివందనం చేసింది. చిన్నతమ్ముణ్ణి ఎత్తుకొని ముద్దులాడింది. అన్నీచేసింది కాని, ఒక్క చిన్ననవ్వు నవ్వలేకపోయింది.

"నా నళిని ఒక్కరోజు ప్రయాణపుబడలికతోనే వాడిపోయింది." అన్నదితల్లి. ఆ వాడినమొహంమళ్లీ వికసించనేలేదు.

ఏదో అతి సామాన్యకారణంతో గొప్పఅనిష్ట సంభ వించడం యీలోకంలో తరచుగా చూస్తూనేవుంటాం. శూర్ప ణఖ మామూలు చిత్తచాంచల్యమే స్వర్ణలంకాపురి విధ్వం సానికి హేతువయింది. సౌందర్యలాలస కారణంగా మహా నగరం మస్సైపోయిన ఉదాహరణలూవున్నై. మహానుభావుడు సత్యహరిశ్చంద్రు డొక సామాన్యకారణంగా మహాపదల పాలయ్యాడు. ప్రపంచంలో ఇలాంటిఉదాహరణ లెన్నైనా వున్నాయి. ఇక్కడా సామాన్య స్వాభిమాన హేతువు మూలం గానే ఘోరవిపత్తు వచ్చిపడింది. మరి సత్యేంద్రునిపై దోషమా రోపించవచ్చునా ?

నళిని ఎన్నడూ అభిమానపడలేదు—భర్త కష్టాన్ని తలచి మెదలకుండా సహించుతూ వచ్చింది – కాని ఇప్పుడామె సహించలేకపోయింది. ఈఅతిస్వల్పకారణంగా భర్త చేత్యజింప బడినప్పుడు చస్తేమాత్రం యేం? అనుకున్నది.

తీవ్రస్వాభిమానంతో నళిని ఎండిపోతోంది. అటు సత్యేంద్రునిపౌరుషం దిగిపోయింది. ఆమేలేనిదే ఒక్కనిమిషం ఉండలేనివాని అభిమానం ఎన్నాళ్ళుంటుంది? ఈఅభిమానమే ఘోర కష్టాలకు దారితీసింది. నళినివద్దనుంచి జాబువస్తుందనీ, తన్ను తీసుకెళ్ళమని రాస్తుందనీ అతడు రోజూ ఎదురుచూస్తు న్నాడు. అలారాస్తే కళ్ళకద్దుకొని తీసుకురావాలని, ఇంకేవిధ మైన అనుచిత వ్యవహారమూ చెయ్యకూడదనీ సత్యేంద్రుడు ఆలోచించుకున్నాడు. కాని జరుగవలసినదాన్ని తప్పించడం ఎవరివశం ? జరగవలసినది జరిగితీరింది. మీరూ మేమూ – అందరం క్షుద్రజీవులంమాత్రమే. ఇవాళ రేపు అనుకుంటూండ

గానే ఆర్నెల్లు గడచిపోయాయి. అయినా ఆ అభాగ్యురాలు ఒక్కముక్కైనా రాయనేలేదు. ఆపాపిష్ఠి సత్యేంద్రుడైనా వంగ లేదు. ఆరునెలలు గడచిపోయాక సత్యేంద్రునికి అసహ్యమైంది. అదృశ్యమైన అభిమానం మళ్ళీ చిగిర్చి తలెత్తింది, ఇంకే ముందీ ? కోపంకూడ ఆవేశించింది. హితాహితజ్ఞానం కోల్పో యిన సత్యేంద్రునికి తనదోషమే కన్పడలేదు. "ఇంత అహం కారం వున్నదానిపై కసితీర్చుకోవాల్సిందే" అనుకున్నాడు

ఎవరికీ తమ తప్పు కనపడటంలేదు. ఏకహృదయు లిద్దరూ భిన్నమైపోయారు. యౌవనారంభదశలో పెరిగిన లత తెగిపోయేరోజు వచ్చింది.

సత్యేంద్రా! నిన్ను నిందించటంలేదు. ఆమెనూ నిందిం చను. ఇద్దరూ తప్పుచేశారు. నేరంకాదు సుమా! తప్పు చూపించితే ఎవరి కధికదుఃఖం కల్గుతుందో భగవంతునికే తెలియాలి. నాకూ తెలియదు. మీకూ తెలియదు. ఏ ఆకాం క్షతో - ఏ ఇచ్ఛాపూర్తికై మీరు యిదంతా చేశారో !

కోరిక నశించదు. నశించాలన్న యిచ్ఛాలేదు. అసలా కోరికయేమిటో అదీ స్పష్టంగా తెలియదు. అయినా వ్యధిత హృదయం ఏదో తీరని అసంతృప్తితో హాహాకారవం చేస్తుంది. ఏం జరుగుతుంది? ఎందుకీవిధంగా కన్పడకుండా అగమ్య ప్రాంతంలో ప్రాకులాడుతుంది? దీనికేవిధమైన నిర్ణయమూలేదు.

తెలివిగలవాడు తెలివిగలవాడే. కోరికకల్గినప్పటికీ - మానసికంగా ద్వంద్వయుద్ధంచేసినా మిమ్ము అపరాధాన్నుంచి విముక్తుల్ని చేస్తాను. చెయ్యేడమేమిటి !

# 8

కోడలు అంత రూపవతీ గుణవతీ అయినా అబ్బాయికి నచ్చనేలేదు.

తల్లికి అమితవిచారంగావుంది. అంతచక్కని చుక్కలు కోడళ్ళుగావచ్చి, ఇల్లు చక్కబెట్టుకోలేకపోయారే అని ఆమె చింత. తల్లిలక్షవిధాల ప్రయత్నించినా కొడుకుమనసుతిరగనే లేదు. ఇంక ఉపాయమేముంది? అబ్బాయికే నచ్చకపోతే ఇంక కోడలేమిటి ? కొడుకు ఆదరించితేనేగద కోడలి ఆదరణ! ఇందులో నాలోపంఏముంది? తను సరిగ్గా చూచుకొని పెళ్ళి చేసుకుంటానంటే నేను ఆపగలనా ? ఇలాగే తన స్వభావాను సారంగా అనుకుంటూ వధువుకు స్వాగత సన్నాహం చేస్తోంది తల్లి.

హరదేవబాబు మృతిచెంది రెండేళ్ళు గడచిపోయాయి. అది జ్ఞాపకంవచ్చి కళ్ళనీరుకమ్మింది. తర్వాత నళిని జ్ఞాపకం వచ్చి కన్నీటిధార ఇంకా తీవ్రమైంది. వచ్చేకోడలు యెలాంటి దవుతుందో ఏంతెలుస్తుంది? సత్యేంద్రుని తండ్రి జీవించివుంటే పాపమా దౌర్భాగ్యురాలికి ఈ స్థితిచూచేగతి పట్టేదికాదేమొ.

సత్యేంద్రుడు పెళ్ళిచేసుకొచ్చాడు. స్వాగతమిచ్చి యిద్దరినీ యింట్లోకితీసుకెళ్ళింది. కళ్ళలో మళ్ళీ నీళ్ళునిండాయి. కన్నీళ్ళుతుడుచుకుంటూ "కంట్లో ఏదో పడింది. మాటి మాటికి నీరు క్రమ్మతోం"దని సర్ది చెప్పుకున్నది.

గిరిబాల నోటిదురుసుపిల్ల, ముఖ్యంగా నళినిపట్ల సోదరీ భావంకలది. "ఈవయస్సులో అప్పుడే మూడుసార్లు అయింది.

ఇంకా ఎన్ని సార్లు ఏమేమి చూడాల్సివస్తుందో ఎవరెరుగుదురు?" అనేసింది.

ఈమాట అత్తగారు విన్నది. సత్యేంద్రుని చెవినికూడ పడింది. మరునాటిరాత్రే శోభనం.

ఎక్కణ్నుంచో మహా వైభవోపేతంగా గొప్ప సారె వచ్చింది. అందులో వధూవరులకు ఢక్కా మజిలీనులతో తయారైన చీరె, చాపు, దుప్పటి వగైరా వున్నై. వధువుకు పంపబడిన ఆ బనారసు చీరెలాంటిది ఇదివరకెన్నడూ ఆఊళ్లో వారు చూచి యెరుగరు. "ఎవరు పంపారీసారె?" అని అందరూ అడుగుతున్నారు. తల్లి ప్రతిసారి గుటకలుమ్రింగి "యెవరో సత్యేంద్రుని స్నేహితుడు పంపా"డని చెపుతోంది.

ఆమె బలవంతంగా కన్నీటి నాపుకొని అసలు విషయాన్ని దాచిపెట్టి ఏడుపులో నవ్వుతూ ఎలాగో సారెతో వచ్చిన పండ్లు-ఫలహారాలను పంచిపెట్టించింది.

అంతా ఎవరిదారినవారు వెళ్ళిపోతున్నారు. వెళ్లేటప్పుడు రాజబాల అన్నది-"మంచిసారె" "ఎందుకాదు? గొప్పవారి యిండ్లనుంచి యిలాంటిసారెలే వస్తాయి" అన్నది నృత్యకాళి.

కాస్సేపటికి ఆ విషయం అడుగునపడ్డాక "మళ్ళీ పెళ్లెందుకు చేసుకున్నాడు?" అన్నది యోగమాయ. "ఏమోనమ్మా! ఎంత చక్కని రూపం ! ఎంత గుణవంతురాలు ఆ రెండో కోడలు! ఏమిటో ఏమీ తెలియకుండావుంది" అన్నది జ్ఞానద.

రాసమణి మంగలిపిల్ల. దానిస్థితి బాగానేవుంది. చూడటానికికూడ అనాకారికాదు. అయితే, కాస్త చప్పిడిముక్కు.

చూచి ఓర్వలేనిరకం మాత్రం ఏనుగుకళ్ళకంటె చిన్నవని ఆమె కళ్ళకున్కూడ వంకపెట్టేవారు.

సరే, అదలావుంచండి, ఆ నిందలతో మన కవసరమే ముంది? చిరునవ్వు నవ్వుతూ రాసమణి అందుకున్నది—"మీ బుర్రల్లో మెదడుంటే అలా అనుకుంటారా? ఆవిడ యెప్పుడూ కేరింతలతో నవ్వుతూ మాట్లాడుతూంటే మా కప్పుడే అనుమానం కలిగింది. ఆమెశీలం మంచిదికాదమ్మా, మంచిదికాదు. లేకపోతే యిలా వెళ్ళగొట్టేసి మళ్లీ పెళ్ళిచేసుకుంటారా?"

నోటితో ఎవరూ ఏమీ అనకపోయినా చాలమంది అభిప్రాయం రాసమణి అభిప్రాయంతో కలిసింది. తర్వాత రెండురోజులకు రాసమణి జమీందారుగారి యింటిగుట్టు కన్పెట్టిందని వూళ్లో అందరికి తెలిసిపోయింది. మంగలిపిల్లకి కాకపోతే బ్రాహ్మణ-కాయస్థులపిల్లల కుంటుందా యింత తెలివి! అందరూ ఆ విషయం అంగీకరించారు.

యింక గృహయజమానురాలివంతు వచ్చింది. యీ మాట చెవినిపడగానే ఆమె తలుపులు, కిటికీలుమూసి క్రింద పడి దొర్లసాగింది. నా నళిని కులటా! అని ఆమెవేదన. ఎంచేతనోగాని ఆమె సరళకంటె మిన్నగా నళినినే ప్రేమించేది. నళిని యావజ్జీవితానికే ప్రారబ్ధం బ్రద్దలైంది. సత్యేంద్రుడు వుంచుకుంటేసరే, లేకపోతే ఆమెను తీసుకెళ్ళి కాశీలోనే వుంటాననుకున్నది ముసలామె తనలో తాను. పాపం! దురదృష్టవంతురాలి జీవితేచ్ఛలన్నీ నశించిపోయినై.

అప్పుడామె తలుపుతీసి మాతంగిని దగ్గరకుపిల్చి తలుపు వేసేసింది. సారె పట్టించుకువచ్చింది మాతంగినే.

ఇద్దరూ కాస్సేపు ఏడ్చి మొత్తుకున్నారు. నళిని బంగారు నాయ ఎలానల్ల బడిపోయినదీ, సత్యేంద్రుడామె నే అపరాధానికి దూరంగా తన్ని వేసిందీ, నళిని అత్తగారి కెలా నమస్కారాలు చెప్పిందీ – ఈ వివరాలన్నీ మాతంగిని మెల్ల మెల్లగా కన్నీళ్ళు తుడుచుకుంటూ చెప్పింది. విన్నతర్వాత అత్తగారి వాత్సల్యం మరీ ఎక్కువైంది. కొడుకుమీద కోపం వచ్చింది. సత్యేంద్రునికి నేనేమీ కానా? నామాటలన్నీ త్రోసివేస్తాడా? ఒక్కమాటైనా వినకపోతాడా? నళినిని తీసుకొస్తాను. నా బిడ్డని ఈ స్థితిలో వదిలేస్తానా? అనుకున్నది లోలోపల.

ఆనాటి సాయంత్రమే తల్లి పుత్రునిపిల్చి "నళినిని తీసుకురారా అబ్బాయ్" అని చెప్పింది.

తల్లి ఏడ్చింది. "ఒరే అబ్బాయ్, నా నళిని మీద వూరంతా పుకారు రేగిందిరా. నువ్వు దానికి భర్తవి–దాని గౌరవం కాపాడవంటరా నాయనా?" అన్నది.

"ఏమని పుకారు ?"

"నువ్వు దాన్ని వెళ్ళగొట్టి, యిలా పెళ్ళి చేసుకొస్తే నే నెవరి నోరు మూయగలను చెప్పు ?"

"నోరుమూస్తే ఏం వస్తుంది?"

"ఇంతకీ తీసుకురావా ?"

"ఊఁ హూఁ"

తల్లి కోపంతో మండిపోయింది. ఆమె ముందే అందుకు సిద్ధపడివుంది కాబట్టి, యేమీ ఆలోచించకుండానే

"అయితే రేపే నన్ను కాశీకి పంపివెయ్యి. ఇంక నే నిక్కడ ఒక్క క్షణంకూడా వుండను" అని చెప్పేసింది.

అతడిప్పుడు వెనుకటి సత్యేంద్రుడుకాదు. సరళకు ఆదరపాత్రమైన నిధి, ఆటవస్తువు - అన్యమనస్కుడు, సరళహృదయుడు, వికసితవదనుడైన భర్త-నళిని నిరంతర కృషి ఫలితంగా దుఃఖ క్లేశములనుండి బయటపడి ఆనందహృదయుడైన ఆ సత్యేంద్రుడు కాదు యిప్పుడు. అతడూ గుండెను రాయిచేసుకున్నాడు. సిగ్గు-శరము, మంచి-చెడ్డల విచక్షణాజ్ఞానం-అన్నీ కోల్పోయాడు. కాబట్టి "నీ కక్కడ బాగుంటుందనుకొంటే అక్కడికే వెళ్ళు, నేనుమాత్రం యెవర్నీ తీసుకొచ్చేది లేదు" అనేశాడు అతి సునాయాసంగా.

సత్యేంద్రుని నోట అలాంటి మాట వస్తుందని తల్లి కలలోనైనా వూహించలేదు. ఆమె ఏడుస్తూ వెళ్ళిపోయింది. వెళ్తూ వెళ్తూ ఈ మాట చెప్పిపోయింది—"నాకోడలు కులట కాదనిమాత్రం తెలుసుకో. లోకులు ఏం చెప్పుకున్నా నే నా మాట ఏమాత్రం నమ్మను."

మర్నాడు మేనత్త సత్యేంద్రుని పిలిచి "నీ స్నేహితు డెవరో నీకు బహుమతులు పంపించాడు చూచావా?" అన్నది.

సత్యేంద్రుడు మెడ వూపి "లేదే, ఎవరేమిటి ?" అని అడిగాడు.

"తెలియదురా అబ్బాయ్. బట్టలూ అవీ తెస్తాను. చూడు"

అని మేనత్త వెళ్ళి ఒక బట్టలప్యాకెట్టు తెచ్చింది. సత్యేంద్రుడు విప్పి చూచాడు. చాలా విలువైన బట్టలు. వాటినిచూచి చకితుడయ్యాడు. ఏ మిత్రుడు పంపివుంటాడా! అని ఆలోచించాడు. బనారసుచీరను తీసిచూస్తుంటే అందులో ఒక చీటీ కనపడింది. విప్పి దస్తూరిచూచేప్పటికి చెంపపెట్టు పెట్టినట్టయింది.

అందులో యిలా రాసివుంది–

“సోదరీ! వాత్సల్యంతో పంపిన బహుమతిని నిరాకరించవద్దు. నీ అక్క పంపిన బహుమతిని స్వీకరించు”

  

శోభనంనాటి రాత్రి పూలపాన్పు సత్యేంద్రునికి కంటకశయ్య అయింది.

## 9

యువకునికుండే ఆత్మాభిమానం ఏబాలునియందైనా చూచావా? సత్యేంద్రునివలె పౌరుషానికిపోయి యింతఅనర్థం తెచ్చిపెట్టుకున్న బాలు డెవర్నన్నా చూచావా? చిన్నతనంలో పుస్తకాలతో ఆటలాడుకుంటూండేవాడిని. అప్పుడు నాన్నగారు కొట్టేవారు. నేను అనుభవించాను. సత్యేంద్రా! నువ్వు హృదయంతో ఆటలాడావు? మరి అందుకు శిక్ష ననుభవించటానికి భయపడుతున్నావా?

మీరు యువకులు. యావత్ప్రపంచము మీకు సౌఖ్యదాయమే. కాని, ప్రతిజీవితగ్రంథి శిథిలమైన బడలికచే దిగజారిపోయినప్పుడు మీలో ఎవరికైనా ప్రాణం బరువుచేటనిపించిన క్షణాలులేవ్రూ? లేకపోతే ఒకసారి సత్యేంద్రునివంక చూడండి. అసహ్యించుకోవాలనుంటే మీ కిష్టంవచ్చినట్లు అసహ్యించుకోండి. ఏవగించుకోండి; కాని సానుభూతి చూపవద్దు. మీరు చీదరించుకున్నా ఏమీఅనడు. జాలితలచవద్దు. చచ్చిపోతాడు!

పాపాత్ముడు మృతిచెందితే ప్రాయశ్చిత్తం అనుభవించేదెవరు? సత్యేంద్రుని జీవితంలో ప్రతిరోజూ దుస్సహభారాన్ని తెచ్చిపెడుతోంది. రోజంతాతన్నుకున్నా ఆభారాన్నిదించుకోలేకపోతున్నాడు.

సత్యేంద్రునికి అప్పుడప్పుడు తన గతజీవితంమరచిపోయినట్టే వుంటుంది. కాకపోతే "తన ప్రియనళిని పాపాన్నిలో కులట అయి అంచేతనే భర్తచే త్యజింపబడిన" దన్నది మాత్రం మరువలేదు.

సత్యేంద్రునికి పెళ్ళై రెండు నెలలయింది. ఇవాళ సత్యేంద్రునికి ఒకజాబుతోసహా ఒక పార్సిలు వచ్చింది.

ఆ వుత్తరం నళిని అన్న నరేంద్రబాబు రాసింది. అందులో యిలావుంది,

"సత్యేంద్రబాబూ!"

నాకు యిష్టంలేకపోయినా ఈవాళ మీకు జాబువ్రాస్తున్నానంటే అది నాకు ప్రాణాధికమైన సోదరి నళినికారణంగానే.

ఆమె చనిపోయేముందు మీా కీ వుంగరాన్ని అందజేయవలసి నదిగా మరీమరీ చెప్పింది. మీా పేరుగల వుంగరాన్ని మీాకు త్రిప్పిపంపుతున్నాను. మీా రీ వుంగరాన్ని మీా క్రొత్తభార్యకు అలంకరించాలని నా సోదరి కోరిక. ఆమె యీా కోరిక తీరు తుందని ఆశిస్తాను. ఆమె ప్రాణంవిడిచేముందు తన చెల్లెలు కష్టాలపాలుకాకూడదని మిమ్మెంతో ప్రార్థించినట్లు తెలుప మన్నది.

—నరేంద్రనాథ్.

  

సత్యేంద్రుడిప్పుడు పాట్నాలో వుండటంలేదు. ఎందు వల్లనైనా నాగాని తల్లికూడ కాశీలోఉండటం పడలేదు. ఆమె కొత్తకోడలు విధుతో కుమారునివద్దనె వుంటోంది. విధు బహుశా పూర్వజన్మలో నళినికి చెల్లెలయివుండొచ్చు.



# చీకటిలో వెలుతురు

చాలాకాలంనాటి సంగతి. సత్యేంద్రచౌధరి జమీందారుబిడ్డ. అతడు బి. ఏ. ప్యాసై యింటికి వచ్చినప్పుడు తల్లి "అబ్బాయ్, పిల్ల సాక్షాత్తు లక్ష్మిరా. నామాటవిని ఒకసారి వెళ్ళి సకళ్ళతో చూచిరా నాయనా" అని చెప్పింది.

సత్యేంద్రుడు తలాడించి "వద్దమ్మా, ఇప్పుడు నేను పెళ్లి చేసుకోను. లేకపోతే నేను పరీక్షలో ప్యాసుకాను" అన్నాడు.

"ఎందుకొక్కాపు? కోడలునాదగ్గరవుంటుంది; నువ్వేమో కలకత్తాలో చదువుకుంటావు. ఇందువల్ల నీ పరీక్షకువచ్చే యిబ్బంది ఏమిటో నాకు తెలియకుండావుందిరా" అన్నది తల్లి.

"కాదమ్మా, ఇప్పుడు మంచిదికాదు. నాకు తీరికాలేదు"

అని సత్యేంద్రుడు బయటికి వెళ్ళిపోబోతూంటే "వెళ్ళమాకురా, కాస్తఆగు, ఒక్కమాట చెప్పనియ్యి" అని ఒక క్షణం ఆగి "అబ్బాయ్, నేను వాళ్ళకు మాట యిచ్చానురా. నువ్వు నామాట నిలబెట్టవూ?" అంది తల్లి.

సత్యేంద్రుడు వెనక్కితిరిగి నిలబడ్డాడు. "నాతో చెప్పకుండానే వాళ్ళకి మాట యెందుకిచ్చావు?" అన్నాడు అసంతృప్తిగా.

కొడుకు అన్నమాటతో తల్లికి కష్టం కలిగింది. సరే, నావల్ల పొరపాటైపోయిందిలే. అయినా నువ్వు తల్లిమాట నిలబెట్టక తప్పదురా అబ్బాయ్. పైగా ఆ విధవావిడకూతురు

పాపం దుస్థితిలో వుందిరా. నా బాబుగా, నా మాట విని ఒప్పుకో". అని బ్రతిమాలింది.

"సరే, ఆనక చెపుతాలే" అని సత్యేంద్రుడు బయటికి వెళ్ళిపోయాడు. తల్లి చాలసేపటివరకు అక్కడే నిలబడి పోయింది. ఇతను ఆమెకు ఏకైక సంతానం. భర్త గతించి ఏ డెనిమిది సంవత్సరాలు కావచ్చింది. అప్పట్నుంచీ ఆవిడ గుమాస్తాలు, ఏజంట్లద్వారా తమకున్న పెద్ద జమీని నిర్వ హించుకొంస్తోంది. కుమారుడు కలకత్తాలో ఏదో కాలేజీలో చదువుతున్నాడు. అతనికి తన జమీని గూర్చిన చింతేమీ లేదు. కొడుకు ప్లీడరీ పాసైన తర్వాత పెళ్ళి చేసి కొడుక్కీ కోడలికీ జమీ బాధ్యత, సంసారభారం అప్ప గించి, తాను కృష్ణా రామా అనుకోవచ్చు ననుకున్నది తల్లి. చదువు పూర్తి అయ్యేలోగా కొడుకును సంసారంగొడవల్లోకి దించి పెద్ద చదువుకు యిబ్బంది కలుగచేయకూడదని కూడా అనుకున్నది. కాని మధ్యలోనే ఇంకోవిధంగా జరిగింది. భర్త మరణించిన తర్వాత ఆ యింట్లో ఈమధ్య పదిమందినీ పిలిచి భోంచేయబెట్టే దేదీ జరుగలేదు. అంచేత ఒకనాడు యేదో వ్రతసందర్భంలో వూళ్లోవారి నందర్నీ ఆహ్వానించింది. అప్పుడు కీ. శే. అతులచంద్రముఖర్జీ భార్య తన పదకొండు సంవత్స రాల పిల్లతోకూడ వచ్చింది. పిల్ల ఆమెకు బాగా నచ్చింది. పిల్ల చక్కనిచుక్కేగాక, గుణవంతురాలనికూడా తన రెండు మూడు ప్రశ్నలకు ఆ పిల్ల చెప్పిన జవాబులు విని సత్యేంద్రుని తల్లి అనుకున్నది.

తన కొడుక్కి ఈ పిల్లనొకసారి చూపించాలనుకున్నది. చూచి ఎలావద్దంటాడో చూస్తాను అని ఆమె మతిలో అనుకున్నది.

మరునాటి మధ్యాహ్నం భోజనానికి గదిలోకి వెళ్ళిన సత్యేంద్రుడు స్తబ్ధుడై నిలబడిపోయాడు. తన పీటకు ఎదురుగా ఒకపీటమీద రత్నమాణిక్యాదులచే అలంకృతమై యేవైకుంఠ లక్ష్మియో అన్నట్టున్న ఒక బాలిక కూర్చునివున్నది.

తల్లివచ్చి "కూర్చో నాయనా" అంది.

సత్యేంద్రునికి మైకం వదిలినట్లయింది. అతడు కొంతగ్రుడై "ఇక్కడెందుకు? ఇంకెక్కడైనా కూర్చుంటాలే" అన్నాడు.

తల్లి చిరునవ్వు నవ్వుతూ "నువ్వు ఇప్పుడే పెళ్ళి చేసుకోవటంలేదులే. ఈ చిన్నపిల్లముందు అంత సిగ్గెందుకు?" అన్నది.

"నాకు సిగ్గెందుకు?" అని సత్యేంద్రుడు కాస్త సిగ్గుపడి అక్కడే కూచున్నాడు. తల్లి వడ్డించి అవతలికి వెళ్ళింది. అతడు గబగబ రెండుముద్దల్లో భోంచేసి లేచిపోయాడు.

ముందుగదిలోకి వెళ్ళేప్పటికి అక్కడ తన మిత్రులు పచ్చీసుబల్ల గవ్వలు ముందుపెట్టుకొని కూచునివున్నారు. సత్యేంద్రుడు ముందుగానే అయిష్టతతో "నేను కూర్చోలేను, మహా తలనొప్పిగావుంది" అని చెప్పి ఒకమూలకుపోయి దిండు మీద తలపెట్టి పడుకున్నాడు. అతడావిధంగా కళ్ళుమూసుకుని పడుకోవడం మిత్రుల కాశ్చర్యంగావుంది. యింక పచ్చీసు ఆడేందుకు మనుష్యులు తక్కువై చదరంగం మొదలెట్టారు. సాయంత్రంవరకు చాలా ఆటలాడారు. మధ్యమధ్య వాగ్వాదాలు, వెక్కిరింతలు జరుగుతున్నా సత్యేంద్రుడు ఒక్కసారికూడ

లేవనూలేదు. ఎవరు గెల్చారో, ఎవరు ఓడిపోయారో కూడ అడగనూలేదు. ఇవాళ అతని కివేమీ జ్ఞాపకుండలా.

మిత్రులు వెళ్ళిపోయినతర్వాత సత్యేంద్రుడు లేచి ఇంట్లోకివెళ్ళి, సరాసరి తనపడకగదిలోకి పోతూంటే సామాను గది వరండాలోంచి తల్లి అడిగింది— "నువ్వివాళ అప్పుడే పడుకోబోతున్నావేంరా అబ్బాయ్?" అని.

"నిద్రపోవటానికి కాదమ్మా, చదువుకోటానికి. ఎం. ఏ. చదవటమంటే సామాన్య మనుకున్నావా ? టైం పాడుచేస్తే ఎలా?" అని థపథప అడుగులేసుకుంటూ పైకి వెళ్ళిపోయాడు.

అరగంట గడిచింది, కాని అత డొక్క పంక్తికూడ చదవలేకపోయాడు. బల్లమీద పుస్తకంమాత్రం తెరిచివుంది. అతడు కుర్చీలో కాళ్ళు చాచుకు పడుకుని పైకి చూస్తూ పై కప్పు కడ్డీలు లెక్కపెడుతున్నాడు. అకస్మాత్తుగా అతనిధ్యానం భంగమైంది. చెవులు రిక్కించివిన్నాడు. ఝుంఝుం! సత్యేంద్రుడు తిన్నగా లేచి కూర్చున్నాడు. అంతలో ఆపాదమస్తకం ఆభరణాలంకృతయై లక్ష్మిలాగున్న ఆ కన్య మెల్లమెల్లగా వస్తూండటం చూచాడు. ఆమె వచ్చి అతనివద్ద నిలబడింది. అతను రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. బాలిక అతికోమలకంఠంతో "అమ్మ మీ అభిప్రాయం కనుక్కురమ్మన్నది" అంది.

సత్యేంద్రుడు కొంచెంసేపు మౌనంగావుండి, తర్వాత "ఎవరి అమ్మ?" అనడిగాడు.

"మా అమ్మే"

ఇంక సత్యేంద్రుడికి జవా బేమని చెప్పాలో తోచలా.

కొంచెమాగి "మా అమ్మ నడిగితే ఆమె చెప్తుంది" అని చెప్పాడు.

బాలిక అక్కణ్నుంచి వెళ్తూండగా సత్యేంద్రుడు తటాలున "నీ పేరేమిటి?" అనడిగాడు.

"రాధారాణి" అని చెప్పి బాలిక వెళ్ళిపోయింది.

## 2

సత్యేంద్రుడు తన్ను వెంటాడుతున్న ఆ చిన్న బాలిక రాధారాణి ధ్యానాన్ని బలవంతంగా తప్పించుకొని ఎం. ఏ. చదవటానికి కలకత్తా వచ్చేశాడు. విశ్వవిద్యాలయంలో తాను చదవతలచిన పరీక్షలన్నీ పూర్తిచేసేవరకు పెళ్ళిచేసుకో కూడదనీ, అసలు సంసార జంజాటంలో చిక్కితే మనిషి ఆత్మగౌరవమే నాశనమౌతుంది కాబట్టి వీలైతే తర్వాతకూడ వివాహం చేసుకోకుండా వుండాలనీ—ఇంకేమేమో నిశ్చయించుకున్నాడు. అయినా వుండివుండి అతని మనస్సు అదోలా అవుతోంది. ఎక్కడ ఏ స్త్రీ కనపడినా ప్రక్కనే మరో చిన్న ముఖంకూడ అతనికి దృగ్గోచర మవుతూండేది. వెన్వెంటనే ఆ చిన్నముఖం ఆ స్త్రీ ముఖాన్నావరించి అదొక్కటే కనపడుతూండేది. ఈ విధంగా సత్యేంద్రుడు రాధారాణి ముఖబింబాన్ని మరువ లేకుండా వున్నాడు. అతను మొదట్నుంచీ ఆడవాళ్ళంటే వుదాసీనభావం కలిగివుండేవాడు. కాని ఆకస్మికంగా అతని కేమయిందోగాని—యిప్పుడు ఏ దారిలోనో మరెక్కడో వయస్సులోవున్న ఏ పడుచుపిల్ల కనపడినా బాగా పరిశీలించి చూడా

లనిపిస్తోంది. ఎంతవద్దనుకున్నా తనదృష్టి నావైపునుండిమరల్చు కోలేకపోతున్నాడు. చూస్తూచూస్తూ హఠాత్తుగా - సిగ్గువల్లనేమో - అతని శరీరంలో కంపంకలిగి వెంటనే అక్కణ్ణుంచి ముక్కుసూటిగా వెళ్ళిపోతూండేవాడు.

సత్యేంద్రునికి ఈత అంటే మహా యిష్టం. అతడు వుంటున్న చోర్‌బాగాన్ వీధికి గంగానది యెంతోదూరంలేదు. అందువల్లే అతడు నిత్యము జగన్నాథ ఘట్టానికి వెళ్ళి స్నానం చేసి వస్తూండేవాడు.

నాడు పౌర్ణమి. రేవులో జనం గుంపులుగా వున్నారు. గంగ ఒడ్డున రోజూ తన పొడిబట్టలు ఒక ఒరియా బ్రాహ్మణునికి ఇచ్చి స్నానానికి వెళ్ళేవాడు. ఆ బ్రాహ్మడివద్దకు పోతూంటే ఒకచోట ఒక గుంపు అడ్డంకాగా సత్యేంద్రుడక్కడ ఆగాడు. అక్కడున్న నలుగురైదుగురువ్యక్తులొకవైపుకుదీక్షగా చూడటం గమనించాడు. ఏమిటాఅని తనూ అటువేపు చూచి విస్మయంతో స్తబ్ధుడయ్యాడు. అంతకుముందు తానుఅటువంటి సౌందర్యం యింకే స్త్రీయందు చూడలేదనిపించింది. ఆమె వయస్సు పధ్ధెనిమిది - పందొమ్మిదికి దాటివుండదు. నల్లజోర్డరు తెల్లచీరధరించిఉంది. ఆమె మోకాళ్ళమీదకూర్చుని పండాచే గంధంబొట్టు పెట్టించుకుంటోంది. ఆ పండా సత్యేంద్రునికి పరిచితుడే.

సత్యేంద్రుడు దగ్గరకుపోయి నిలబడ్డాడు. ఇతనివల్లకూడ బాగా దక్షిణ ముట్టుతూండేది. అంచేత పండా వెంటనే రూపవతిఅయిన ఆ చంద్రముఖిని వదలి చేతిలోని బొట్టుపెట్టె పుల్ల

నవతల పారేసి ఈ బాబుగారి పొడిబట్టలుఅందుకోటానికిచెయి జాపాడు.

ఇద్దరికళ్ళూ కలిశాయి. సత్యేంద్రుడు తన బట్టలను పండాచేతికిచ్చి మెట్లుదిగి నీటిలో ప్రవేశించాడు. కాని అతడివాళ ఈదలేదు. ఎలాగో మూడు మునకలువేసి స్నానం ముగించుకొని పైకి వచ్చేటప్పటికి ఆ అపురూప సౌందర్యరాశి అక్కణ్నుంచి వెళ్లిపోయింది.

ఆవాళ పగలంతా సత్యేంద్రుని మనస్సు గంగఒడ్డునే వుంది. మరునాడు సరిగ్గా తెల్లవారకముందే వంకెనున్న పంచె ఒకటి భుజాన వేసుకొని గంగానదివేపు నడిచాడు.

రేవుకుపోయిచూస్తే ఆ అపరిచిత రూపవతి అప్పుడే స్నానంచేసి పైకివచ్చింది. సత్యేంద్రుడు గంగలోమునిగి పండా వద్దకు వచ్చేసరికి ఆ సౌందర్యఖని క్రితంనాటివలెనె పండాచేత లలాటంమీద చందనంపెట్టించుకుంటోంది. ఇవాళకూడా ఇద్దరి చూపులు కలిశాయి. సత్యేంద్రునికి దేహంలో విద్యుత్తు ప్రవహించినట్టయింది. గబగబ పొడిబట్టలు కట్టుకొని అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు.

## 3

ఆ యువతి రోజూ ఉదయాన గంగాస్నానానికి వస్తూంటుందని సత్యేంద్రుడు గ్రహించాడు. తాను కొంచె మాలస్యంగా వస్తూండటంవల్లే యింతవరకు తామిద్దరికి సాక్షాత్కారం జరగలేదనుకున్నాడు.

గంగఒడ్డున వరుసగా వారంరోజుల నుంచీ పరస్పరం చూచుకోవటం జరుగుతూనేవుంది. కాని ఏ ఒకరు మాట్లాడ టానికీ సంయోగం కుదరలా. కళ్ళు మాట్లాడుతూంటే నోరు మూగది కావలసిందేగా. ఆ అపరిచిత వన్నెలాడి ఎవరైనా గానీ కళ్ళతో మాట్లాడే విద్యలో బాగా ఆరితేరినదే. ఈ విష యం సత్యేంద్రు డిట్టే గ్రహించాడు.

ఆ నాడు సత్యేంద్రుడు స్నానంచేసి పరధ్యానంగా ఇంటికి వెడుతున్నాడు. ఆకస్మాత్తుగా "ఏమండోయి, ఒక్క మాట" అన్నమాట చెవినిపడింది. అతను తలెత్తిచూచాడు. రైలురోడ్డు అవతలిప్రక్కన ఆమె నిలబడుంది. ఆమె ఎడమ చంకలో నడుంమీద చిన్న నీళ్ళబిందెవుంది. కుడిచేతిలోతడిబట్ట వుంది. ఆమె తలూపి సైగచేసి పిల్చింది. సత్యేంద్రుడు అటూయిటూ చూచి ఆమెదరికివెళ్ళి నుంచున్నాడు. ఆమె అదోరకంగా చూస్తూ మృదుస్వరంతో "ఇవాళ నా దాసి రాలేదు. దయవుంచి మీరుకాస్త నాతోవచ్చి పంపిస్తే చాలా మేలు"అంది. ఆమె రోజూ ఒక దాసినికూడా తీసుకొనివస్తూం డేది. కాని యివాళఒంటరిగానేవుంది. సత్యేంద్రుడు సందిగ్ధంలో పడ్డాడు. ఈపని మంచిది కాదనిపించింది అతని మనస్సుకి. కాని కాదని చెప్పలేకపోయాడు. అతని మనోభావం తెలుసుకొని ఆమెనవ్వింది. ఆరకంగా నవ్వేస్త్రీకి ఈ ప్రపంచంలో అలభ్య మైనదేదీ వుండదు. సత్యేంద్రుడు వెంటనే "సరే, పదండి" అని ఆమెవెంట నడిచాడు. నాలుగడుగులువేసి ఆమె "దాసీకి జబ్బుగా వున్నందున రాలేకపోయింది. మరి నేను గంగలో

స్నానం చెయ్యకుండానూ వుండలేను. మీకూ ఈ అలవాటు వున్నట్టుందే?" అన్నది.

"అవును, నేనూ సాధారణంగా గంగాస్నానానికి వస్తుంటాను" అన్నాడు సత్యేంద్రుడు.

"మీరు వుండే దెక్కడ?"

"చోర్ బాగాన్‌లో"

"మాయిల్లు జోడాబాంకూలో వుంది. మీరు నన్ను పథూరియాఘాట్ మలుపుదాకా పంపి అక్కడ్నుంచి పెద్ద రోడ్డున వెళ్ళొచ్చు."

"అలాగే"

తర్వాత చాలా సేపటివరకు మళ్లీ యిద్దరూ మాట్లాడ లేదు. చిత్పూర్ రోడ్డుకు చేరిఆమె వెనక్కి తిరిగి నిలబడింది. ఒక నవ్వునవ్వి "చాలు, నా యిల్లు ఇక్కడికి దగ్గరే ఇంక మీరు వెళ్లొచ్చు. నమస్తే" అన్నది.

సత్యేంద్రుడునమస్కారంచెప్పి మెడవంచుకొని చరచర వెళ్ళిపోయాడు. ఆనాటి అతని మానసికస్థితిని వ్రాయటం అసంభవం. ఆనాడేమి జరిగిందో అది కేవలం ప్రథమ యౌవన దశలో మన్మథుని ప్రథమ పుష్పశరాఘాతాన్ని సహించిన వారికి మాత్రమే బోధపడుతుంది. ఏఉన్మాదమైకంచేమత్తిల్లితే భూమి, నీరు, ఆకాశం- అన్నీ రంగులు వేసినట్టు కన్పిస్తాయో, మరి ఈ విధంగా తెలివి-చైతన్యము కోల్పోయి-నిర్జీవమూదంటు రాయిలాగా- ఆ ఒకే ఒక వేపుకు ఆకర్షింపబడటానికి ప్రతి క్షణము ఉత్కంఠితుడైపోతాడో- అది అందరికీ అర్థంకాదు.

మరునాడు సత్యేంద్రుడు లేచేప్పటికే ఎండపొడ వచ్చింది. వ్యాఘాతరంగ మొకటి అతని గొంతుకనుసహితం ఒక కుదుపు కుదిపిపోయింది. ఇంక ఆవాళ వ్యర్థమైపోయినట్టే నను కున్నాడు. ప్రక్కగా నౌకరువెళ్తూంటే పిల్చి "ఇంతప్రొద్దెక్కినా నన్ను లేపనేలేదేరా వెధవా? నీకు ఒకరూపాయి జరిమానా వేశాన్లే" అని కోప్పడి తిట్టాడు.

పాపం వాడి ప్రైప్రాణం పైనే పోయినట్టయి నిర్ఘాంత పోయి చూస్తూ నిలబడ్డాడు. సత్యేంద్రుడు వేరే బట్టయినా తీసుకోకుండా ఉన్న పాళాన వెళ్ళిపోయాడు.

బయటికి వెళ్ళి కిరాయిబండి ఎక్కి పథూరియాఘాట్‌కు పోనిమ్మన్నాడు. తాను బండిలో కూచుని రోడ్డు కిరుప్రక్కలా చూస్తున్నాడు ఆత్రుతతో. కాని, రేవువద్దకు చేరగానే అతని కలతపోయి మనస్సు శాంతించింది. అప్పు డతని కేదో అమూల్య రత్నం దొరికినట్టుంది.

సత్యేంద్రుడు బండిలోంచి దిగుతూండగానే ఆమె చిరు నవ్వుతో సమీపించి మిక్కిలి పరిచయమున్నదానివలె "ఇవాళ యింత ఆలస్యం చేశారేం? అరగంటనుంచి మీకోసం నిలబడి వున్నాను. త్వరగా స్నానంచేసిరండి; ఈవాళకూడా దాసీది రానేలేదు" అని చెప్పింది.

"సరే, ఒక్క నిమిషం ఆగండి" అని సత్యేంద్రుడు నీటిలో దిగాడు. అతని ఈతమోజు ఏమైపోయిందో, గబగబ రెండుమూడుసార్లు మునిగి లేచివచ్చాడు. తానువచ్చిన బండి కనపడక "బండి ఏదీ?" అనడిగాడు.

"నేను బాడుగయిచ్చి పంపేశాను" అన్నది ఆ రమణి.

"కిరాయి మీ రిచ్చారా ?"

"ఇచ్చేశానులెండి; నడవండి" అని ఆ భువనమోహిని నవ్వి దారితీసింది.

సత్యేంద్రుడు పూర్తిగా హృదయా న్నర్పించివేశాడు. లేకుంటే ఎంత తెలియనివాడికైనా, ఎంత చేష్టారహితునికైనా "ఏమిటిదంతా?" అన్న సందేహం కలుగకపోదు.

దారిలో ఆమె అడిగింది—"మీ ఇల్లు ఎక్కడన్నారూ? చోర్ బాగాన (దొంగలతోట)లోనా?"

"అవును"

"అక్కడ దొంగలుమాత్రమే వుంటారుకాబోలు!"

సత్యేంద్రుడు చకితాత్ముడై "ఏం, అలా అన్నారు?" అన్నాడు.

"మీరు దొంగలసర్దారు కదా !"

అని రమణి మెడ వంకరగాపెట్టి, ఒక కటాక్షం విసిరి నవ్వుతూ హంసగమనంతో నడవసాగింది. ఇవాళ ఆమె నడుం మీదవున్న నీళ్ళబిందె కాస్త పెద్దది. అందులో నిండుగావున్న గంగాజలం "ఛలా ఛల్" "ఛలాఛల్"అన్న ధ్వనిచేస్తూ "ఓరి మూర్ఖుడా!" ఓ గ్రుడ్డియువకుడా ! జాగ్రత! ఇదంతా కపటం. పచ్చిమోసం ! అని హెచ్చరించుతోందా అన్నట్టు పైకి ఎగురుతూ, ప్రక్కకు తొలుకుతూ చిందుతూ ఒకప్పుడు తిరస్కరించుతూ, మరొకప్పుడు హేళనచేస్తోంది !

మలుపులోకి చేరినతర్వాత సత్యేంద్రుడు సంకోచంగా "మరి బండి కిరాయి?" అన్నాడు.

సుందరి వెనుదిరిగి నుంచున్నది. అస్పష్టకోమలకంఠంతో "ఒకవిధంగా అది మీరు యిచ్చినట్లేగా" అంది.

సత్యేంద్రుడా సంకేతాన్ని గ్రహించక "నే నిచ్చిన టెలాగు?" అనడిగాడు.

"నే నివ్వటానికి యింకా నావద్ద మిగిలిం దేముంది ? నా కున్నది కాస్తా మీరు ముందే దోచేసుకుంటిరిగా" అని ఆమె వెంటనే మొహం ప్రక్కకు త్రిప్పుకుంది. పొంగి పొర్లి వస్తున్న నవ్వు నామె బలవంతంగా ఆపుకున్నది.

సత్యేంద్రుడా అభినయాన్ని గమనించలా. కాబట్టే దోచుకోవటమన్న ప్రచ్ఛన్న సంకేతం మెరుపులా అతని సంశయాన్ని ఛేదించివేసి హృదయాంతరాళంలో తళుక్కుమంది. అప్పుడే ఆ నడిరోడ్డుమీద ఆమె ఎర్రని పాదపద్మాలపై పొర్లా లనిపించింది సత్యేంద్రుడుకి. కాని, మరుక్షణంలోనే లజ్జాధిక్యతచే అతనితల వాలిపోయింది. మళ్ళీ శిరమెత్తి తనప్రేయసి మొహం చూడలేకపోయాడు. మెదలకుండా వంచిన తలతో మెల్ల మెల్లగా వెళ్ళిపోయాడు.

కళ్ళతో చూచినాసరే అసంభవమైన ఘటన నెవరితోను చెప్పకూడదని అనుభవజ్ఞులు చెప్పారు. ఈ పొరపాటునకు అవ స్థలపాలైన ఉదాహరణలూవున్నై. ఏమైనప్పటికి సత్యేంద్రుడు యింటికివెళ్ళి టెనిసన్ కవిత్వం చదవటము, "డాకాజులన్"ను బెంగాలీలోకి అనువదించ నారంభించడం మాత్రం నిజం. అతను ఇంత పెద్దవాడై నాకూడ కలకత్తావంటి మహాపట్టణంలో పట్టపగలు నడిరోడ్డుమీద, స్నానాలరేవులో యిటువంటి అద్భుత ప్రేమవాహిని ఎలా పొంగివచ్చిందా, ఆ వరదతరంగా

లలో మునిగి నడవటం యెంతవరకు ప్రమాదరహితమో నని సందేహమే కలుగలేదు.

రెండురోజులైనతర్వాత మళ్లీ అదేవిధంగా యిద్దరూ స్నానంచేసి తిరిగి వస్తూండగా ఆ అపరిచిత "రాత్రి నేను నాటకం చూట్టానికి వెళ్ళాను. పాపం! సరళ కష్టాలు చూచి నా గుండె పగిలిపోయిందనుకోండి" అంది.

సత్యేంద్రుడు సరళనాటకం చూళ్ళేదు. కాని స్వర్ణలత నవల చదివాడు. అందుచేత "అవును, పాపం! చాలా దుస్థితి లో మరణించింది" అన్నాడు మెల్లగా.

ఆమె దీర్ఘనిట్టూర్పు వదలి "ఓహో, ఆమె కెంత కష్ట మొచ్చింది. సరళ తనభర్త నంతగా యెందుకు ప్రేమించిందో, మరి ఆమె పెద్ద తోటికోడలు ఏల ప్రేమించలేకపోయిందో చెపుతారూ దయచేసి?" అనడిగింది.

"అది వారి వారి స్వభావం" అని ముక్తసరిగా జవా బిచ్చాడు సత్యేంద్రుడు.

"అవును, అంతే. పెళ్ళి అందరికీఅవుతుంది. కాని స్త్రీలూ పురుషులూ అందరూ ఒకర్నొకరు సమానంగా ప్రేమిస్తు న్నారా? లేదు. చచ్చేంతవరకూ ప్రేమ అంటేనే తెలియని వాళ్ళు చాలామంది వుంటారు. వారి కసలు తెలుసుకోగల శక్తేవుండదు. చూడరాదూ, యెదుట ఎన్ని చక్కని పాటలు పాడినా వారు మనసుంచి వినలేరు కొందరు. చాలమందికి ఏ మాటకూ కోపమేరాదు. వారి కసలు కోపగించుకోవటమె తెలియదు. లోకం వారినే మెచ్చుకుంటుంది కాని, నాకు మాత్రం వారిని నిందించాలనిపిస్తుంది"

అతడు చిర్నవ్వునవ్వి "ఎందువల్ల?" అనడిగాడు.

"వారు ఓర్వలేనివారు కాబట్టి ఓర్వలేనితనంలో కూడ కొంత మంచిగుణం వుండవచ్చు. కాని దోషమే అధికం. సగిళి బావగారినూడిరే. భార్య ఘోరఅత్యాచారాలు చూసైనా అతనికి కోపంరాలేదు చూడండి!" అన్నది వుత్తేజితస్వరంతో ఆ రమణి.

అతను మౌనంగానే వున్నాడు. ఆమె మళ్ళీ యిలా అన్నది- "మరి అతనిభార్య ప్రమద ఎటువంటి దుష్కరాలు! నేనైతేనా, ఆరాకుసిపీక పిసికేసేదాన్ని"

సత్యేంద్రుడు నవ్వి "కాని నువ్విలా అవుతావు? ప్రిదమ అనే స్త్రీ యెవరైనా వుంటేగా. అది కేవలం కవికల్పన మాత్రమే..."

అతన్ని పూర్తిగా చెప్పనివ్వకుండానే మధ్యలో ఆపి ఆమె అన్నది-"అయితే కవి అలాంటికల్పన ఎందుకు చెయ్యాలి? సరే మనుషులందరి హృదయాల్లోను దేవుడుంటాడని, ఆత్మవుంటుం దని అంతా చెపుతారు: కాని ప్రమద అంతరంగంలో భగవంతు డున్నాడని తోచదు. నేను మీతో నిజం చెపుతున్నాను- గొప్పగొప్పవారిపుస్తకాలు చదివి మంచివాళ్ళవడం, ఇతరులను ప్రేమించడం లేకపోగా, మనిషియందు మనిషికి ద్వేషంకల్గించే పుస్తకం రాసివేయటం చూస్తే అందరి అంతఃకరణాల్లోను భగ వన్మందిరం వుంటుందన్న విశ్వాసమే కలుగదు."

సత్యేంద్రుడు విస్మితుడై ఆమె మొహంలోకి చూస్తూ "నువ్వు బాగా పుస్తకాలు చదువుతావనుకుంటాను" అన్నాడు.

"నాకు ఇంగ్లీషేమీరాదు. కాని బెంగాలీలో వెలువడే పుస్తకాలన్నీ చదువుతూంటాను. ఒక్కొక్కప్పుడు రాత్రులు తెల్లవార్లు చదువుతాను. ఆఁ, పెద్దరోడ్డుకు వచ్చేశాం; మా యింటివద్ద ఎన్ని పుస్తకా లున్నాయో చూపిస్తాను, రారాదూ ?" అన్నదామె.

అతడు వులిక్కిపడ్డాడు. "మీ యింటికా?" అన్నాడు.

"అవును, మాయింటికే, నడవండి; మీరు వచ్చితీరాలి"

హఠాత్తుగా అతని మోహం తెల్లబడింది. "వద్దు,వద్దు, ఛ ఛ తప్పు... ..."

"ఛ-ఛ లేదు, ఛి-ఛీ లేదు రండి"

"వద్దు-వద్దు, ఇవాళకాదులే, ఇవాళ వద్దు" అని సత్యేంద్రుడు తడబడుతున్న అడుగులతో గబగబా వెళ్ళిపోయాడు. నేడతనికి తన అపరచిత ప్రేయసియందు గురి ఏర్పడింది. ఆ భారంతో అతడు అవనతహృదయుడయ్యాడు.

## 5

ఉదయాన స్నానంచేసి సత్యేంద్రుడు ఇంటికివచ్చాడు. అతని కళ్లు అలసినట్లున్నాయి. రెప్పలింకా తడిగానే వున్నై. నాలుగు రోజుల్నుంచీ అతనికి ఆ అపరిచిత ప్రేయసి దర్శనమే కాలేదు. ప్రస్తుతం ఆమె గంగాస్నానానికి రావటంలేదు.

ఈమధ్య కొన్ని దినములనుండి భూమ్యాకాశాలను ఏకంచేసి ఎన్నెన్ని విషయాలు ఆలోచించాడో అంతులేదు. ఆమె ఈ లోకంలోనే లేకుండాపోవడం సంభవించకూడదనీ,

మరణశయ్యపై పడివుండేస్థితి కలుగరాదనీ కోరుకున్నాడు. ఏమిటి కారణం? ఆమె కేమైనట్టు?

అతని కా సందు గుర్తువుందికాని, అంతకంటే ఇంకేమీ తెలియదు. తలచుకున్నకొద్దీ పశ్చాత్తాప - దుఃఖములచే హృదయం దహించుకుపోతోంది. ఆవాళ రమ్మన్నప్పుడు యెందుకు వెళ్ళకపోతినా? యెందు కామె ఆహ్వానాన్ని తిరస్కరించానా? అని వ్యథ చెందుతున్నాడు.

అత డామెను నిజంగానే ప్రేమించాడు. అది కేవలం కళ్ళమైకంకాదు. హృదయపూర్వకమైన ప్రేమపిపాసే. అందులో మోసానికి వంచనకి తావులేదు. అతనికున్న దల్లా యదార్థమైన నిష్కళంక అనురాగం మాత్రమే.

"బాబుగారూ!"

సత్యేంద్రుడు వులిక్కిపడి చూచాడు. ఆమెవెంట వస్తూవుండే దాసి రోడ్డు కొక ప్రక్కగా నిలబడివుంది.

అతడు గాబరాపడుతూ చప్పున ఆమెను సమీపించాడు గద్గదస్వరంతో "ఆమెకేమైంది?" అనడుగుతూండగానే అతనికి యేడ్పువచ్చింది. ఇంక ఆపుకోలేకపోయాడు. దాసి తలవంచుకొని వస్తూన్న నవ్వును ఎలాగో బిగపట్టి ఆపుకున్నది. సత్యేంద్రునిముందు తన కెక్కడ నవ్వు వచ్చేస్తుందోనన్న భయంతో దాసి తలవాంచుకొనే "ఆమెకు జబ్బుగావుంది. మిమ్మల్ని చూడాలంటోంది" అని చెప్పింది.

"సరే పద."

అని సత్యేంద్రుడు కళ్ళు తుడుచుకుంటూ దాన్ని వెంబ

డించాడు. కొంతదూరం వెళ్ళిన తర్వాత "జబ్బేమిటి ? మరీ ప్రమాదంగావుందా ?" అనడిగాడు

"అంత ప్రమాదమేమీలేదు. జ్వరం యెక్కువగానే వుంది" అని దాసి చెప్పింది.

సత్యేంద్రుడు లోలోన భగవంతుని ప్రార్థించాడు. దాసిని మరేమీ ప్రశ్నించలేదు. ఇంటిముందుకు వెళ్ళారు. ఇల్లు చాలా పెద్దది. ద్వారంవద్ద ఒక దర్వానుకూర్చుని కునికి పాట్లు పడుతున్నాడు. "నేను వస్తే ఆమె తండ్రికి కోపం రాదూ ? నన్నాయన యెరుగరుగా" అని దాసితో అన్నాడు.

"ఆమెకు తండ్రిలేరు, తల్లిమాత్రమే వుంది ఆమెకైనా కుమార్తెలాగానే మీరంటే యిష్టమేనండీ" అన్నది దాసి.

సత్యేంద్రుడు యింకేమీ మాట్లాడకుండా యింట్లో ప్రవేశించాడు.

మెట్లెక్కి మూడో అంతస్తు వరండాలోకి వెళ్ళాడు. మూడు పెద్ద గదులున్నై. బయటినుంచి చూస్తే మూడూ చక్కగా అలంకరింపబడినట్లు కన్పడుతున్నై. మూలగదిలోంచి కేరింతలతో పాట, తబలా, గజ్జెలధ్వని వినవస్తున్నాయి. దాసి "అదే గది, పదండి" అని చేత్తో చూపింది ఆ గదినే.

దాసి ముందు వెళ్లి పరదా తొలగించి "ఇదుగోనమ్మా అక్కా ! నీ ప్రియస్నేహితుడు !" అని బిగ్గరగా కేకపెట్టింది.

గదిలో పెద్దగా నవ్వు గల్లంతు బయల్దేరాయి. అక్కడి దృశ్యాన్ని చూడగానే సత్యేంద్రుని తల తిరిగిపోయింది. హఠాత్తుగా తెలివితప్పి పడిపోతున్నట్లనిపించింది.

గడప నాధారంచేసుకొని, కళ్ళు మూసుకొని మండిగంమీాదే చతికిలబడ్డాడు.

ఆ గదిలో బల్లమీాద పరుపు పరచివుంది.దాని మీాద పెద్ద మనుష్యుల్లా కన్పిస్తున్న వా రిద్దరు ముగ్గురు కూర్చొనివున్నారు. ఒకడు తబలాముందు, హార్మోనీముందు ఒకడు కూర్చున్నారు. మరొకడు హుషారుగా మధుపానం చేస్తున్నాడు. యువతి అప్పటివరకు నాట్యం చేసినట్లుంది—కాళ్ళకు గజ్జెలున్నాయి. ఒంటినిండా ఆభరణాలు వున్నై. ఆమె కళ్ళు త్రాగి మత్తిలి నట్లు వూగులాడుతున్నాయి. ఆమె చప్పున సత్యేంద్రుని సమీాపించి, అతని చేతులు పట్టుకొని కిల కిల నవ్వి "ఏం మిత్రమా, నీకు అపస్మారకపుజబ్బు లేదుగదా? ఇంక చాల్లే నీ పరిహాసం, లే, లే, నాకు భయమేస్తోంది విన్నుచూస్తే" అన్నది.

చైతన్యవిహీనుడు విద్యుత్ స్పర్శచే వణకిపోయినట్లు సత్యేంద్రు డామె కరస్పర్శచే ఆపాదమస్తకం చలించిపోయాడు.

"నాపేరు బిజలీ; మరి నీ పేరేమిటి మిత్రమా? మొద్దబ్బాయా? దద్దమ్మా?" అని అడిగింది.

అంతా బాగా విరగబడి నవ్వారు. దాని క్రిందపడి దొర్లుతూ "బలే, భేష్, అక్కా! బలేగా చాటలుకడు తున్నావే" అంది.

బిజలీ కృత్రిమక్రోధం ప్రకటించుతూ "నోర్మూయ్, ఆట్టే వాగబోకు" మని కోప్పడి అతనితో "రండి, ఇలావచ్చి కూర్చోండి." అని సత్యేంద్రుని బలవంతంగా లాక్కెళ్లి ఒక కుర్చీలో కూర్చోబెట్టింది. తాను అతని పాదాలవద్ద మోకాళ్ళ మీాద కూర్చొని చేతులు జోడించి ఒక పాట పాడింది.

మద్యపానంచేస్తున్నవ్యక్తి లేచి సత్యేంద్రునిముందుకు వచ్చి సాష్టాంగ ప్రణామంచేశాడు. అతడు బాగా మైకంలో వున్నాడు. ఏడుస్తూ అన్నాడు-"మహారాజా! నేను మహా పాపాత్ముణ్ణి; నాకు తమ పాదధూళికొంచె..."

హార్మోనీ వాయించుతూన్న మనిషి ఇంకా తెలివిలోనే వున్నాడు. వాడు సానుభూతి సూచకంగా అన్నాడు-"పాపం ఎందు కాయన్ని పిచ్చివాణ్ణిచేసి ఆడించటం?"

బిజలీ నవ్వుతూ "వహ్వా, ఉత్తుత్త్ ఆటేమిటి? ఇది నిజమైన తమాషాయే. కాబట్టే ఇలాంటి హుషారైన రోజున రప్పించి మీకు తమాషా చూపిస్తున్నాను-సరే, బుద్ధూగారూ! నేనెవరిననుకొన్నారో నామీద ఒట్టేసుకొని నిజం చెప్పండి. నిత్యము గంగాస్నానం చేసేదాన్నికాబట్టి నేను బ్రాహ్మ మతానికిచెందినదాన్నో క్రైస్తవయువతినో,తురకబూబునోఅను కోవటానికి వీల్లేనుకదా. ఇంక హిందూపడుచునే అయివుండా లనుకోవాలి. అలా అయినప్పుడు యీ వయసులోవున్న నేను సధవనో విధవనో అయివుండాలిగద. మరి మీరు నన్నేమను కొని ప్రేమించసాగారండీ? నన్ను పెళ్ళాడుదా మనుకున్నారా? లేక భ్రమపెట్టి ఎక్కడికైనా లేవదీసుకుపోదామనుకున్నారా? ఏమనుకున్నారో చెప్పండి" అని అడిగింది.

మళ్లీ విరగబడి నవ్వటం జరిగింది. తర్వాత అందరూ ఏమేమొ అన్నారు. కాని సత్యేంద్రుడు తలెత్తనూ లేదు. దేనికీ సమాధానమూ చెప్పలేదు. అతడు మనసులో ఏమను కుంటున్నాడో చెప్పడం కష్టమే. చెప్పినా ఒప్పుకొనే దెవరు? అయినా పోనీండి ఆ విషయాన్ని.

బిజలీ ఒక్కసారిగా చకితమై లేచి నుంచున్నది. "అరరె ఏ పనిచేశానే! ఒరే శ్యామూ, త్వరగాపోయి బాబుగారికి ఫలహారం తీసుకురా. పాపం! స్నానంచేసి సరాసరి ఇక్కడికి వచ్చేస్తే నేను పరిహాసంచేస్తూ కూర్చున్నానే!" అన్నది.

మాట్లాడుతూ మాట్లాడుతూండగానే అంతకుముందు ఎకసెక్కములాడి పరిహసించిన ఆమె కంఠస్వరంలో వాత్సల్యంతో కూడిన అకృత్రిమానురాగం ప్రస్ఫుటమైంది.

కొద్దిసేపట్లోనే దాసి ఫలహారములపళ్ళెం తెచ్చిపెట్టింది. బిజలీ ఆ పళ్ళెము నందుకొని సత్యేంద్రునిముందు మోకాళ్లపై కూర్చుని "తల పైకెత్తండి. ఇది కాస్త తినండి" అన్నది.

సత్యేంద్రు డింతవరకు తన యావచ్ఛక్తినీ సమీకరించుకొని నిలద్రొక్కుకుంటున్నాడు. తలపైకెత్తి, శాంతభావంతో "నేను తినను" అని చెప్పేశాడు.

"ఏం? మీ జాతి భ్రష్టమైపోతుందా? నేను మాదిగదాన్ననుకున్నారా, పాకీదాన్ననుకున్నారా?"

సత్యేంద్రుడు అదే శాంతభావంతో "మీరు అలాంటి వారైతే తినేవాణ్నే. కాని మీరెవరో తెలిసిందిగా" అన్నాడు.

బిజలీ కిలకిల నవ్వి "ఆఁ హాఁ, బుద్ధూబాబుకికూడా చురుకుఅంటించటం తెలుసే!" అని మళ్లీ నవ్వింది. కాని ఈసారి ఆమె నవ్వు నవ్వుగాలేదు. అంచేతనే ఇంకెవ్వరూ ఆ నవ్వులో నవ్వు కలపలేదు.

"నాపేరు సత్యేంద్రుడు కాని, బుద్ధూకాను. నేనెప్పుడూ చురుకుఅంటించడం నేర్చుకోలేదు. కాని నా పొరపాటు తెలిసిన తర్వాత దిద్దుకోవటంమాత్రం నేర్చుకున్నాను," అన్నాడు.

బిజలీ ఏమోచెప్పబోయి ఆపుకొని, చివరికిలా అడిగింది
"మీరు నేను ముట్టుకున్నది తినరా ?"

"తినను"

బిజలీ లేచి నుంచున్నది. ఈపర్యాయం ఆమె పరిహాస స్వరం కొంచెం తీవ్రంగావుంది. ఆమె "మీరు తింటారు, తప్పకుండా తింటారు. ఇవాళకాకపోతే రేపు, రేపుకాకుంటే రెండు రోజులతర్వాత తిని తీరుతారు." అన్నది ధీమాగా.

సత్యేంద్రుడు తలాడించి "ఇదిగో చూడండి, పొరపాటు ఎవరికైనా వస్తుంది. నా పొరపా టెంతపెద్దపొరపాటో అందరికీ తెలిసిపోయింది. కాని మీరూ పొరపాటుపడుతున్నారు. నేడూ లేదు, రేపూలేదు, ఈ జన్మలోను, వచ్చేజన్మలో కూడ నేను మీరు ముట్టుకున్నది తినటం జరగదని చెపుతున్నాను. మీ శ్వాస తగిలి నా రక్తం విరిగిపోతోంది. ఇంక వెళ్తున్నాను, సెలవు" అన్నాడు.

అతని మొహంలో గాఢ ద్వేషచిహ్నాలు కన్పించాయి. అది ఆ త్రాగుబోతుకూడ గమనించాడు. వాడు, "బిజలీ బీబీ! రసికత్వం తెలియనివానితో యెందుకు పోట్లాడ్డం! ఇతగాడివల్ల పొద్దున్నే మన హుషారంతా పాడై పోయింది" అన్నాడు.

బిజలీ మాట్లాడలేదు. స్తబ్ధురాలై సత్యేంద్రుని మొహం వంకచూస్తూ నిలబడివుంది. నిజంగానే ఆమెవల్ల పెద్దపొరబాటు జరిగిపోయింది. అలాంటి బిడియపడేమనిషి శాంతస్వభావి ఈ విధంగా మాట్లాడుతాడని ఆమె వూహించనేలేదు.

సత్యేంద్రుడు లేచి నిలబడ్డాడు. బిజలీ కోమలకంఠంతో "మరి కొంచెంసేపు కూర్చోండి" అన్నది.

ఇది విని త్రాగుబోతు "ఉఁహుఁహుఁ. మొదటిదెబ్బతో యిప్పుడలాగే వుంటాడులే, వెళ్ళనియ్యి. కాస్త వుచ్చు వదులు చెయ్యి" అన్నాడు.

సత్యేంద్రుడు మౌనంగా గదిబయటికి వచ్చాడు. బిజలీ చప్పున వెళ్లి దారికడ్డంగా నిలబడి "వాళ్ళు చూస్తారనిగాని, లేక పోతే నావల్ల గొప్పతప్పు జరిగిందని చేతులు జోడించి చెప్పే దాన్ని" అన్నది మెల్లగా.

సత్యేంద్రుడు జవాబేమీ యివ్వకుండానే మొహం త్రిప్పేసుకున్నాడు.

"ఈ ప్రక్కగది నేను చదువుకునేగది. ఒకసారివచ్చి చూడరూ! మిమ్మల్ని క్షమాపణ కోరుకుంటున్నాను. అందు లోకివచ్చి ఒకసారిచూడండి" అన్నది బిజలీ మళ్లీ.

"ఉఁహూ!" అని అతడు మెట్లవేపు నడిచాడు. బిజలీ అతని వెంటబడి "మళ్లీ కలుసుకోవటం యెప్పుడూ?" అనడిగింది.

"ఇంక లేదు."

"ఏఁ, ఇంకెప్పుడూ కలుసుకోరా ?"

"ఉఁహూఁ"

బిజలీకి ఏడ్పువచ్చింది. ఎదురుగుటక మ్రింగి గొంతు సవరించుకుని "మళ్లీ కలుసుకోవటం జరుగదని నాకు నమ్మకం కల్గటంలేదు. అంతే జరిగినా మీరు నామాట వొకటి నమ్మరూ" అన్నది.

ఆమెభగ్నస్వరంవిని సత్యేంద్రుడు విస్మితుడయ్యాడు. కాని పదిహేనురోజులుగా చూస్తూవచ్చిన అభినయంముందు యిది యేపాటి? అయినా అతడు మొహం త్రిప్పకొని నుంచు

న్నాడు. అతని మొహంలో అవిశ్వాస చిహ్నాలు చదువుకొని బిజలీహృదయం వ్రయ్యలైంది. కాని ఏంచేస్తుంది? విశ్వాసం కలిగించగల అన్నివుపాయాలను మకిలికడుక్కున్నట్టు చెయ్యి కడుక్కొని కూచున్నదామె !

"ఏమాట నమ్మాలి ?"

బిజలీ పెదవులు కదిలినై కాని శబ్దం బయటికి రాలా. అశ్రుభారంతో అణగివున్న రెప్పల నొకసారి పైకెత్తి, మళ్ళీ దించుకున్నది. సత్యేంద్రు డది చూచాడు. కాని, కన్నీళ్ళు మాత్రం కృత్రిమాశ్రువులు కాకూడదూ ? బిజలీ తలెత్త కుండానే అతడు జవాబుకోసం ఎదురుచూస్తున్నాడని గ్రహించింది. కాని ఆమె యెన్నితంటాలుపడినా ఆ మాట నోటితో అనలేకపోయింది.

ఆమె అతన్ని ప్రేమించసాగినది. ఆ ప్రేమలో రవంతైనా సార్థకంచేసుకోవటాని కామె అవసరమైతే సౌందర్యభాండార మైన తన దేహాన్నైనా ఒక మసిపాతగుడ్డలాగా త్యాగంచేయ గలదు. కాని ఆమెను విశ్వసించేదెవరు? ఆమె కళంకినిఅయి వుండె. తనదేహంనిండా అపరాధచిహ్నాలతో న్యాయమూర్తి యెదుట నిలబడి – అపరాధంచేయడమే వృత్తి అయినా, ఈ పర్యాయంమాత్రం తాను నిర్దోషినని ఏ మొహంతో చెప్పు తుంది ? ఆలస్యమవుతున్నకొద్దీ ఆమె న్యాయమూర్తి తనకు ఉరిశిక్ష విధించబోతున్నాడనే భావించుతోంది. అయితే మాత్రం తా నెలా ఆపగలదు ? సత్యేంద్రు డింక ప్రతీక్షించ లేక "ఇక వెళుతున్నాను" అన్నాడు.

బిజలీ తలెత్తలేకపోయిందిగాని, ఈసారి నోట్లోనుంచి మాట బయటకొచ్చింది.—"వెళ్ళండి. కాని నేను ఆపాదమస్తకం అపరాధాల్లో మునిగివున్నా, నేను నమ్మిన విషయాన్ని విశ్వసించక మీరూ అపరాధికావద్దు. అందరిలోను భగవంతుడు వుంటాడనీ ప్రాణం పోయేంతవరకు వారి దేహాలను వదిలిపెట్టడనీ నమ్మండి" అన్నది.

కొంచెమాగి మళ్ళీ చెప్పింది – "అన్ని మందిరాల్లోనూ పూజ జరుగకపోయినా, అన్నిటిలోను వున్నది దేవతలే ననేది నిజం. వారిని చూచి తలొంచలేకపోవచ్చును గాని, కాలదన్నిమాత్రం వెళ్ళలేరు."

అని చెప్తూచుండగానే పదధ్వని విని తలెత్తి చూచింది–సత్యేంద్రుడు మెల్లగా వెళ్ళిపోతున్నాడు.

స్వభావానికి వ్యతిరేకంగా తిరుగుబాటుచేయొచ్చుగాని, దాన్ని బొత్తుగా యెగరగొట్టేయడానికి వీల్లేదు. స్త్రీశరీరం మీద యెన్ని అత్యాచారాలు చేసినా స్త్రీత్వాన్ని అంగీకరంచక తప్పుతుందా? బిజలీ నర్తకే అయినా స్త్రీయేగదా! జీవితంలో వేలాది అపరాధాలుచేసిన దోషే అయినా, ఆమె దేహం స్త్రీ దేహమేకదా! ఒక గంటతర్వాత తన గదిలోకి తిరిగివెళ్ళినప్పుడు కళంకం కారణంగా సగంచచ్చినట్టున్న ఆమె స్త్రీ స్వభావము అమృతస్పర్శతో జాగరితమైనది. ఈ కొద్ది సేపట్లోనే ఆమెలో కలిగిన అద్భుత పరివర్తన ఆ త్రాగుబోతుకుకూడ విదితమైంది. వాడు నోరు తెరచి "ఏం బీబీ! నీ కనురెప్పలు చెమ్మగిలివున్నాయేం? ఓరి దేవుడా! ఇంత మంచి పదార్థాలుకూడ నోట్లో వేసుకోనేలేదు, యెంత మొండివాడో

ఈ కుర్రాడు ! పోనీలే, ఆ పళ్లెం యిలా యివ్వు" అనేశాడు. తానే పళ్ళెం తీసుకుని ఒక్కొక్కటే మ్రింగసాగాడు.

కాని వాడి మాట ఒక్కటీ బిజలీ చెవికెక్కనేలేదు. చటుక్కున తన పాదాలవంక చూసుకున్నది. కాళ్ళకు కట్టి వున్న గజ్జెలు తేలుకొండెముల్లాగ పొడుస్తున్నట్లనిపించింది. వెంటనే వాటిని వూడదీసి విసిరి పారవేసింది.

"గజ్జెలు విప్పేశావా?" అని ఒకడు అడిగాడు.

బిజలీ శిరమెత్తి మందహాసంచేస్తూ "అవును, యింక నేను వీటిని కట్టుకోను" అన్నది.

"అంటే?"

"అంటే ఏముంది, ఇంకెప్పుడూ కట్టనన్నమాట. మీ బీబీ చచ్చిపోయింది !"

త్రాగుబోతు లడ్డూతింటున్నవాడల్లా "అసలుజబ్బేమిటి" అనడిగాడు. బిజలీకి నవ్వొచ్చింది. ఆనవ్వే! నవ్వుతూ అన్నది- "దీపం వెలిగితే ఏజబ్బుతో చీకటి అంతరిస్తుందో, సూర్యోదయంతో రాత్రి ఏరోగంవల్ల అంతరించుతుందో ఆ జబ్బుతోనే యివాళ మీ బీబీ శాశ్వతంగా చచ్చిపోయింది."

## 6

నాలుగేళ్ళు గడచిపోయాయి. కలకత్తాలో ఒక విశాలోన్నత భవనంలో ఒక గొప్ప జమీందారుగారి పుత్రునికి అన్నప్రాశన జరిగింది. భోజనాలూ అవీ పూర్తిఅయినాయి. సాయంత్రం భవనముందరి ప్రాంగణంలో నాట్యసభ ఏర్పాటు

చేయబడింది. అనేకవిధములైన భోగవిలాసాలు, గానా-బజా నాలకు సన్నాహం జరుగుతోంది.

ఒక వైపున ముగ్గురు నాట్యకత్తెలు కూర్చొనివున్నారు. నాట్యంచేసేదీ, పాడేదీ వారే. రెండో అంతస్తు వరండాలో వెదురుపరదాచాటున ఒంటరిగా కూర్చున్న రాధారాణి క్రిందికి వచ్చినవారిని చూస్తోంది. ఆహ్వానించబడిన నారీమణు లింకను రాలేదు.

సత్యేంద్రుడు గప్ చిప్‌గా వెనుకనుంచివచ్చి మెల్లగా "అంత దీక్షగా చూస్తూన్నా వేమిటి?" అని అడిగాడు.

రాధారాణి భర్తమొహంలోకి చూచి నవ్వుతూ "చూడటానికి వస్తూన్నవారినేనండి. ఆ నాట్యకత్తెల అలం కారాలూ అవీ చూస్తున్నాను. సరేకాని, అకస్మాత్తుగామీరు యిటు వచ్చారేనిటి?" అంది.

భర్త నవ్వుతూ "నువ్విక్కడ ఒక్కతెవే కూర్చున్నా వని వచ్చాను" అన్నాడు.

"ఆఁ, చాల్లెద్దురూ, వెళ్ళండి, అక్కడికి వెళ్ళుదురూ"

"నిజమే. సరేకాని, వాళ్ళలో ఎవరు నచ్చారు నీకు?"

రాధారాణి "ఆమె" అని అతిసామాన్య దుస్తులుధరించి అందరికీ వెనుక కూర్చొనివున్న నర్తకిని వ్రేలితో చూపింది.

"ఆమె మరీ బక్కపల్చగా రోగిష్టిలా వున్నదే!" అన్నాడు సత్యేంద్రుడు.

"అయినా అందరికంటె ఆమె చాలా అందంగావుంది. పాపం! పేదదల్లేవుంది - అందరివలె ఆమె ఒంటిమీద ఆభర ణాలు లేవు."

"కావచ్చు; కాని వీళ్ళకిచ్చే రేటెంతెంతో తెలుసా?" అన్నాడు భర్త.

"తెలియదు"

సత్యేంద్రుడు చేత్తో చూపిస్తూ "ఆఇద్దరికి ఒక్కొక్కరికి ముప్ఫయిరూపాయలు ఆమెకు యాభై ఇవ్వాలి. నువ్వందరి కంటె పేదరాలన్నావే ఆమె రెండువందలు పుచ్చుకుంటుంది" అనిచెప్పాడు. రాధారాణి విస్మయంచెంది"రెండువందలే! ఎందుకని? ఆమె చాలాబాగా పాడుతుందా యేం?" అని అడిగింది.

"పాడుతూండగా విన్లేదుగాని నాలుగైదు సంవత్సరాల క్రితం బాగా పాడేదని అంటారు. ఇప్పుడు బాగా పాడగలదో లేదో చెప్పలేను."

"అయితే అంత పెద్ద మొత్తం యిచ్చి యెందుకు పిల్పించారు?"

"అంతకు తక్కువైతే ఆమె రానేరాదు. రెండు వందలకైనా అసలు ఒప్పుకోనేలేదు. ఎంతో బలవంతంమీాద రప్పించడం జరిగింది."

రాధారాణికి మరీ ఆశ్చర్యంకలిగింది."డబ్బిచ్చేటప్పుడు బలవంతంగా ఒప్పించడ మేమిటండీ?" అని అడిగింది.

సత్యేంద్రుడు సమీాపంలోని కుర్చీలాగుకొని కూర్చుని "అసలు సంగతేమిటంటే ప్రస్తుతం ఆమె ఈ వృత్తి వదలిపెట్టింది. ఆమెలో ఎంతగొప్పతనమున్నా ఇంత మొత్తం యిచ్చే వాళ్ళుండరు. కాబట్టి సాధారణంగా ఆమె పాటకచ్చేరీకి వెళ్ళటమంటూనే వుండదు. ఇదీ ఆమె వ్యవహారం. ఇక రెండో కారణం నా స్వవిషయానికి సంబంధించినది." అని చెప్పాడు.

ఈమాటలు రాధారాణి నమ్మలేకపోయింది. అయినా తెలుసుకోవాలన్న పట్టుదలతో ముందుకు జరిగి "మీా స్వవిషయమేముంటుంది కాని ఆమె ఈ వృత్తి నేల విడిచిపెట్టిందో చెప్పుదురూ" అన్నది.

"వింటావా ?"

"చెప్పండి"

ఒకక్షణమాగి సత్యేంద్రుడు "ఈమెపేరు బిజలీ. ఒకప్పుడు – కాని రాణీ! ఇక్కడికి జనంరానచ్చు, లోపలికిపద చెప్తాను." అన్నాడు.

"అయితే వెళ్దాంరండి" అనిరాధారాణి చప్పునలేచింది.

* * *

భర్తపాదసన్నిధిని కూర్చుని రాధారాణి అంతావిన్నాక కళ్ళుతుడుచుకొని చివరకు "అందుకని మీారివాళ ఆమెపై కసి తీర్చుకుంటూరా! ఎవరు చెప్పారండి మీా కీ బుద్ధి?" అన్నది.

సత్యేంద్రుని కళ్ళూ చెమ్మగిల్లినై. చెప్పుతూండగా అనేకసార్లు అతని గొంతుపట్టుకున్నది. "నిజమే, అవమానమే కాని మన ముగ్గురికీ తప్ప యింకెవ్వరికీ తెలియదు" అన్నాడు.

రాధారాణి ఇంకేం మాట్లాడలా. మరొకసారి కన్నీళ్లు చెంగుతో తుడుచుకొని బయటికి వెళ్ళిపోయింది. ఆహ్వానితులచే సభ నిండిపోయింది. పైన వరండాలో పరదాచాటున స్త్రీలు చేరారు. మిగతా నాట్యకర్తెలు సిద్ధమయ్యారు. కాని బిజలీ యింకా తలవంచుకొనే కూర్చొనివుంది. ఆమె నేత్రముల నుండి అశ్రుధార ప్రవహిస్తోంది. ఆమె అదివరకు సంపాదించిన

ధనమంతా యీ అయిదేండ్లలో ఖర్చయిపోయింది. ధనాభావం చేపడుతున్న అవస్థవల్లనే తాను శపథంచేసి వదలిపెట్టేసిన గజ్జె లీవాళ కట్టటానికి అంగీకరించాల్సివచ్చింది. కాని తలెత్తి నిలబడలేకపోతోంది. అపరిచిత పురుషుల చూపులకు తనశరీర మీవిధంగా రాయిలా భారమైపోతుందనిగాని కాళ్ళరీతిని తేలిపోతాయనిగాని రెండు గంటలక్రితమైనా ఆమెవూహించలేదు.

"మిమ్మల్ని పిలుస్తున్నారు"

బిజలీ తలెత్తి చూస్తే పదిపన్నెండేండ్ల కుర్రవాడు తన ముందు నిలబడివున్నాడు. వాడు పైవరండావేపు చూపిస్తూ "అమ్మగారు మిమ్మల్ని పిలుచుకురమ్మన్నారు." అని మళ్ళీ చెప్పాడు.

బిజలీ విశ్వసించలేకపోయింది. "ఎవరు రమ్మన్నారు?" అని అడిగింది.

"అమ్మగారు"

"నువ్వెవరివి?"

"నేను వారి నౌకర్ను"

బిజలీ తలాడించి "కాదు. నన్ను పిలిచివుండరు నువ్వు పోయి మళ్ళి అడుగు" అంది.

కుర్రవాడు కాస్సేపట్లో పోయివచ్చి "మీ పేరేగద బిజలీ? మిమ్మల్నే రమ్మంటున్నారు నావెంటరండి, అమ్మగారు నిలబడి వున్నారు" అని చెప్పాడు.

బిజలీ చప్పున కాళ్ళగజ్జెలు విప్పి ఆ కుర్రవాడివెంట ఇంట్లోకి వెళ్ళింది. యజమానురాలు ప్రత్యేకంగా ఏదో ఆజ్ఞాపించడానికి తన్ను పిలిచినదని తలచింది.

రాధారాణి కుమారుని చంక నెత్తుకొని పడకగదిద్వారం వద్ద నిలబడివుంది. కొంతగాబరాతోను కొంత సంకోచంతోను బిజలీ మెల్లమెల్లగా రాగానే రాధారాణి ఆదరపూర్వకంగా ఆమెచేయి నందిపుచ్చుకొని గదిలోకితీసుకెళ్ళింది. బలవంతగా కుర్చీలో కూర్చోబెట్టి నవ్వుతూ "అక్కా నేనెవర్నో తెలుసుకోగలిగావా?" అనడిగింది.

బిజలీ ఆశ్చర్యంతో హతబుద్ధిఅయింది. రాధారాణి కొడుకును చూపుతూ "నీచెల్లెల్ని గుర్తించలేకపోయినా చింతేమీలేదుగాని, వీడినైనా గుర్తించలేకపోతేమాత్రం నేను నిజంగానే పోట్లాడుతాను అక్కా!" అని నవ్వసాగినది.

ఆ నవ్వటంచూచికూడా బిజలీనోట మాటరాలా. కాని ఆమెకళ్ళముందరి అంధకారావృత ఆకాశమండలం క్రమక్రమంగా స్వచ్ఛమవుతోంది. ఆమెచూపు నిష్కళంక సుందరి మొహాన్నుంచి అప్పుడే వికసించిన గులాబిపుష్పంలాగున్న శిశువుమొహంమీద ప్రసరించింది. రెప్పవాల్చకుండా చూస్తూంటే రాధారాణి స్తబ్ధులా నిలబడివుంది. బిజలీ తదేకధ్యానంతో చూచిచూచి టక్కునలేచి పిల్లవాణ్ణి ఒడిలోకి తీసుకొని గట్టిగా యెదకదుముకొని ఏడ్వసాగినది.

"ఏం అక్కా! గుర్తుపట్టావా?" అనడిగింది రాధారాణి.

"తెలిసింది చెల్లీ!"

"సముద్రాన్ని మథించి తీసినవిషాన్ని స్వయంగా నువ్వు మ్రింగి అమృతాన్ని నీ యీ చెల్లెలికి యిచ్చావు అక్కా! ఆయన మిమ్ముకోరారు. కాబట్టే నేను వారినిపొందగలిగాను" అన్నది రాధారాణి.

సత్యేంద్రుని చిన్నఫొటో ఒకటి తీసిపుచ్చుకొని బిజలీ తదేకధ్యానంతో చూస్తున్నది. తలెత్తి "చెల్లీ! విషానికి విషమే అమృత మవుతుంది. అయినా నేనూ వంచింపబడ లేదమ్మా. ఆవిషం ఈ మహాపాపిష్టురాలిని కూడ చిరంజీవినిని, చేసింది." అన్నది.

రాధారాణి ఈమాటలకేమీ జవాబివ్వక "ఏం అక్కా! వారి నొకసారి కలుసుకుంటావా ?" అని అడిగింది.

బిజలీ ఒకక్షణం కళ్ళుమూసుకొని వుండి "వద్దు చెల్లీ. నాలుగేండ్ల నాడు ఈ అంటరానిదాన్ని గుర్తించి వారు అసహ్యంతో మొహం త్రిప్పేసుకొని వచ్చేస్తూంటే నేను "మళ్లీ కలుసుకుంటాం. మళ్లీ వచ్చితీరుతా"రని గర్వంతో అన్నాను. కాని ఆ నా గర్వం వుడిగిపోయింది. వారు రానేలేదు. భగవంతుడు నా ఆ గర్వాన్ని ఎందుకు భంగపరిచాడో తెలియటంలేదు. సోదరీ ! ఆయన ఎలా తునకలుచేసి మళ్ళి అతికించుతాడో, ఎలా లాక్కొని తిరిగి యిచ్చేస్తాడో నాకు తెలిసినట్లు యింకొకరికి తెలియదు." మరొకసారి కళ్ళుతుడుచుకొని "నేను హృదయానికి దెబ్బతగిలి దేవుని నిష్ఠురుడనీ, కఠినాత్ముడనీ నిందించాను. కాని, నిజాని కాయన ఈ పాపిష్టిదానిపై ఎంత దయచూపారో యిప్పుడు తెలుసుకుంటున్నాను. ఇప్పుడు భగవంతుడు వారిని తీసుకొచ్చి నా కిచ్చినట్లయితే నేను అన్ని విధాలా బుగ్గిఅయిపోతాను. వారివిపొందలేనుసరిగదా, నన్నే కోల్పోతాను"అన్నది.

రాధారాణికి ఏడ్పువచ్చి కఠం రుద్ధమై ఏమీ మాట్లాడజాలకపోయింది. బిజలీ మళ్ళి చెప్పసాగింది – మళ్లీ